






**అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైనశక్తి అది ముమ్మాటికీ 'ఎవరెడి'**

UC-4277

# ఉత్తరాలు

### సీరియల్

మీ మా ఆంధ్రపత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ వుంటాను. అందులో సీరియల్సు చాలా బాగున్నాయి. కె. రామలక్ష్మిగారి ప్రేమించు ప్రేమకై బాగుంది. లలిత ఇక్కడ నుంచి ఏమి బాధలు పడుతుందో.

సాల(గామం సుబ్బులక్ష్మి, (శ్రీకాకుళం).

పత్రిక రాగానే ఎంత తొందర పని వున్నప్పటికిని ముందు సుజాత సీరియల్ చదివి మరల పత్రిక ఎప్పుడు వచ్చునా సుజాత ఏమగునోయని యెదురు చూచుచున్న మాకు 'సుజాత' సీరియల్ సమాప్తం మనగనే ఏదో పోగొట్టుకొనిన వారివలె బాధపడితిమి.

తూమాటి పద్మావతి, (కాటూరు)

### క థ లు

మీ ఆంధ్రసచిత్ర వారపత్రికలో (6—12—68) యర్రంసెట్టి శాయిగారి గొలుసు కథ 'నీలాంటి ఒకరు' అనుకోని విధంగా ముగిసినది. యీ కథలో గౌరీపతి పాత్ర చాలా చక్కగా సృష్టించారు. "ప్రేమ— పన్నాగము" చదివినంత సేపు మంచి హుషారుగా నడిచింది.

యీవారం మహేష్‌వారి "ముగ్గురు మూర్ఖులు" పత్రికకు మంచి నిండుతనము చూపించారు.

చోడే మల్లికార్జునరావు, (ఏలూరు)

### సి ని మా

మీ 29—11—68 వ తేది పత్రికలో ముగ్గురు "విజ్ఞాన సముపార్జనాప్రియుల" లేఖ చదివి ఈ క్రింద విషయాలు వ్రాయ బుద్ధి కలిగినది.

1. "మీకు తెలుసా?" అనే దానికి తెలిస్తేయేం? తెలవక పోతేనేం? అనే వారికి ఏ "రావు"గారు ఎప్పుడు డాక్టరు అయితేనేం? ఎందు కవుతేనేం? F. R. C. S. A. B. C. S. X. Y. Z. లాంటి డిగ్రీలు ఎందుకొస్తేనేం? ఎలా వస్తేనేం? ఆయనకి ఎందరు పిల్లలు వుంటేయేం? ఎక్కడ వుద్యోగాలు చేస్తే యేం? అనే సందేహాలు ఎందుకు కలుగలేదు!?

2. 64 పేజీల పత్రికలోని 10 లేక 12 పేజీల "సినిమా" శీర్షికని పట్టుకుని ఒకటికి పదిసార్లు చదివి, అందులోని శీర్షికల లిస్టు కంఠతా పట్టి, 'బోర్' కొట్టిస్తున్నారని "కంప్లయింట్" చేయకపోతే, ఇంచక్కా ఆ మిగతా 52 పేజీలు చదువుకోకూడదూ?!! అప్పుడు వారి విజ్ఞానం మరింత పెరిగి పోతుంది!

3. 'సినిమా' శీర్షికలని తిట్టడం ఫాషనయి పోయింది. కాని పత్రికల సర్క్యులేషన్‌కి అది ఎంత దోహదమో పత్రికలు నడిపేవారికి తెలుస్తుంది. 'స్క్రీన్ టుడే' లో వ్యాసాలు 'ప్లేబాయ్' లో ప్రచురించితే ఎట్లా వుంటుందో ఆంధ్ర సచిత్ర వారపత్రికలాంటి కుటుంబం అంతా చదివే పత్రికలో 'సినిమా శీర్షిక' లేకపోవటం అంత ఎబ్బెట్టుగా వుంటుంది.

4. ఇలాంటి నీతిబోధకులు, ఉత్పత్తి శాస్త్రజ్ఞులు నుంచి మిమ్మల్ని భగవంతుడు కాపాడు గాక!

ఎమ్. ఎస్. ప్రకాష్ (ఏలూరు).

### కా ర్టూ న్

గతవారం అనగా 29—11—68 సంచికలో 19 వ పేజీలోనున్న కార్టూన్ చాల అసహజముగా, శోచనీయముగా నున్నది. ఒక రైలు సురక్షితంగా గమ్యస్థానం చేరుటలో ప్రధాన పాత్రధారులు, డ్రైవరు, గార్డు, అసిస్టెంట్ స్టేషన్‌మాస్టరు.













మరఫీ యిప్పుడు మీకు చాల అందమైన
మీడి యంవేవ్‌లో మరొక ట్రాన్సిస్టర్‌ను అను
గ్రహిస్తున్నది — మున్నా. స్టేషన్‌లను
దోషరహితంగా. దగ్గరగా ఆకర్షించును,
చాలశక్తిగలది. యితరశబ్దములు లేనట్టి
రిసెప్షన్ గలది. ప్రతిస్థలమందు తేలికగాదొ
రకుచున్నట్టి 4 బేటరీలు వాడ బడుచున్నవి.

*విక్రయపుపన్ను, మరియితరయే
స్థానిక పుపన్ను యున్నా అదనము.
(ధర బేటరీలు లేకుండానే)



మర్ఫీ — ఇంటిలో అందరి ఆహ్లాదమునకు!

NAS 331

రైలు ప్రమాదాలన్నిటికీ డ్రైవరే ముఖ్యకారకుడనుకొంటే చాల పొరపాటు. ఏ డ్రైవరూ కావాలని ప్రమాదాన్ని సృష్టించుటకు ప్రయత్నించడు. రైల్వే ప్రమాదాలకు అనేక కారణాలు ఉన్నాయి. ఈ కార్టూన్ రైల్వే డ్రైవర్లనే కాకుండా రైల్వే పనివారలందర్నీ అవమానపరిచేట్టుగా వున్నది. ఇకమీదనైనా మీ కార్టూనిస్టు బాబు గారు ఇటువంటి కార్టూన్లు వేయరని ఆశిస్తున్నాము.

పి. అప్పారావ్, (నెల్లి).

## వ్యాసాలు

29—11—68 తేది ఆంధ్ర సచిత్రవార పత్రికలో కాన్పూరు నుంచి వ్రాసిన ఉత్తరం చదివి చాలా సంతోషించినాను. వారి సూచన చాలా మంచిదని నేను అనుకొంటున్నాను. గాన వారు సూచించిన విషయములు మీరు తప్పక పాటించి పత్రిక స్టాండర్డు పెంచుతారని ఆశిస్తాను. చవకబారు విషయములు ప్రచురించి పత్రిక స్టాండర్డు తగ్గించకుండా చూస్తారని కూడా ఆశిస్తాను.

గణపతిరావు (పాలకొల్లు)

## న్యూఢిల్లీ లేఖ

1—11—68 వ సంచికలోని 'న్యూఢిల్లీ లేఖ' చదివాను. శ్రీకృష్ణగారు జనసంఘం వారిని భారతదేశ శత్రువుల క్రింద జమకట్టారు. ఇది చాలా విచారకరం. సర్వనాశనమవుతున్న భారతదేశానికి పూర్వపు వైభవాన్ని తిరిగి కలిగించాలని, ఒకప్పుడు ప్రపంచమంతటిచేతా జోహార్ అని గౌరవించబడి, పొగడబడి పరిస్థితుల ప్రాబల్యం చేత విధర్మీయుల, విదేశీయుల కుట్రల వల్ల, రాష్ట్రీయుల తెలివి తక్కువ చేత దిగజారిపోయిన తమ మాతృదేశాన్ని తిరిగి అత్యున్నత స్థితికి తీసుకొని పోవాలని అహర్నిశలు కృషి చేస్తున్న

# ఉత్తరాలు

జనసంఘీయులా దేశద్రోహులు ?!?! ఈ పవిత్ర కార్యం కోసం వివాహం సైతం చేసుకోకుండా వున్న జనసంఘ నాయకులా హిందూదేశ శత్రువులు ?? ప్రభుత్వం అన్యాయం చేస్తూ వుంటే అందుకు నిరసనగా ఉద్యమాలు, సమ్మెలు నడపటం దేశద్రోహమా?? అప్పటి ప్రభుత్వానికి వ్యతిరేకంగా మహాత్మాగాంధి కూడ వందేమాతర ఉద్యమాన్ని నడిపించారు. అయితే ఆయన కూడ దేశద్రోహియా?? అన్యాయమనేది బ్రిటిష్ ప్రభుత్వం వారిచే చేయబడినా మన ప్రభుత్వం వారిచే చేయబడినా అన్యాయమనే అనిపించుకుంటుంది.

జనసంఘం వారు అధికారంలోకి వస్తే ఏమి చేయలేరని, న్యాయంగా పాలించలేరని శ్రీకృష్ణ గారి అభిప్రాయం. ఇప్పుడు ఢిల్లీ నగరం వారి అధికారంలోనే వుందిగా. ఇంతకుముందు పాలక వర్గం వారు లైసెన్సులు లేకుండా తమకు కావలసిన వారిని మిల్లులు, ఫాక్టరీలు నడుపుకోనిచ్చారు. మునిసిపాలిటీ స్థలాలలో రోడ్లకు అడ్డంగా ఇండ్లను కట్టుకోనిచ్చారు. ఇలా ఇండ్లను కట్టుకోవటం వల్ల వీధులు ఇరుకయ్యాయి, అశుభ్రంగా తయారయ్యాయి. ఇప్పుడు జనసంఘం వారు వీటిని ఎలా తొలగిస్తున్నారో, ఢిల్లీ వీధులు ఎంత శుభ్రంగా తయారయ్యాయో సర్వజన విదితమే. ఇప్పుడు ప్రతి ఫాక్టరీ లైసెన్సుకై దరఖాస్తు పెట్టుకుంటూ వుంది.

జనసంఘం దేశ ఔన్నత్యానికై పాటుపడే రాజకీయ సంస్థ అని శ్రీకృష్ణ గారు గుర్తించి ఇకమీదటయినా మంచిచెడ్డ ఆలోచించి వ్యాసాలు వ్రాస్తారని ఆశిస్తాను.

నాకు అత్యంత అభిమాన పాత్రమైన వార పత్రిక ఆంధ్రపత్రికలో ఇలాంటి వ్యాసాన్ని చదవవలసి వచ్చినందుకు చాలా చింతిస్తున్నాను.

విజయ్ (శ్రీశైలం ఆత్మకూరు)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 20—12—'68
కీలకనామ సం॥ పుష్యమాసం శుద్ధ పాడ్యమి

సంపుటము : 61 సంచిక : 17

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి భారతి

లాటరీ డబ్బు
లాటరీ డబ్బు
లాటరీ డబ్బు
అలాంటి డబ్బు మాకొద్దు
ఆంధ్ర ప్రదేశ్

'నిజం' నిప్పును రగిల్చే మనిషి
రాజాజీకి ౯౦ ఏళ్లు నిండాయి
ప్రజాస్వామ్యం






న్యూ ఢిల్లీ లేఖ

# ఎవరికి వారే... దేశం సంగతి ఎవరికి కావాలి?

పాకిస్తాన్ సృష్టికి ఎవరు కారణం? ఉత్తరప్రదేశం హైందవులే అనటానికి బలమయిన సాక్ష్యం బయట పడుతోంది. 1900 లో ఆ ప్రాంతంలో ముసల్మానుల భాష అనదగిన ఉర్దూని బహిష్కరించారు. 1857 దాకా మహమ్మదీయులే అక్కడి పరిపాలకులు. ప్రజాస్వామ్య పద్ధతులు రావటంతో వారికి శాసన సభలలో స్థానం లేకపోయింది. వారు ఇంగ్లీషు నేర్చుకోనక పోవటంచేత ఉద్యోగాలు సంపాదించు కొన లేక పోయారు.

అక్టోబరు 1, 1906 నాడు ఆగాఖాను కొందరు మహమ్మదీయులతో బాటు వెళ్ళి మింటో ప్రభువుని సందర్శించుకున్నారు. ఈ సందర్శనం ఫలితంగా మహమ్మదీయులకి ప్రత్యేకమయిన ఎలక్టరేట్లు ఏర్పడ్డాయి. అప్పటి వయిస్రాయి కార్యదర్శి ఇలా రాశారు తన డయరీలో: 'ఈ విధంగా మహమ్మదీయులకి ప్రత్యేక స్థానం లభించింది. దేశ విచ్ఛిన్నానికి కావలసిన బీజాలు నాటబడ్డాయి...'

15 ఆగస్టు, 1947 నాడు భారత దేశం రెండు ముక్కలయి పోయింది.

## నెహ్రూ తదనంతరం...

శ్రీ నెహ్రూ తదనంతరం నాలుగు గమనించదగ్గ విశేషాలు ఉన్నాయి. అవి, 1. అస్థిర పరిస్థితి, 2. నిర్ణయం లేమి, 3. కమ్యూనిజం, 4. జనసంఘం. ముందు జనసంఘం గురించి రాస్తాను.

జనసంఘం ముఖ్యంగా నగరాలకి సంబంధించిన పార్టీ. సభ్యులలో ఎక్కువమంది వ్యాపారస్థులు, అంగళ్ళవారు. యుద్ధ సమయంలో వచ్చిన రేషనింగు విధానాలవల్ల ఎప్పటినుంచో వ్యాపారం చేసుకుంటూ వచ్చిన వర్గాలవారు తమ సాంప్రదాయిక జీవనోపాధులని కోల్పోయారు. 1967 నుంచి అమలులోకి వచ్చిన ప్రభుత్వ ఆహారధాన్య వ్యాపార విధానాలు కూడా వ్యాపార వర్గాలవారిని దెబ్బ తీస్తున్నాయి. అప్పటి కాలంలో ఏలుతున్న బ్రిటిషువారికి ఎదురుగా కాంగ్రెసుని బలపరిచిన వ్యాపారులు నేటి ప్రభువులయిన కాంగ్రెసువారికి ఎదురుగా జనసంఘంలో చేరుతున్నారు.

## అల్పసంఖ్యాకుల భయాలు

కొంతకాలంగా నియంతృత్వాన్ని బలపరిచే 'ఫాసిస్టు' పద్ధతులు ప్రచారంలోకి వస్తున్నాయి. వీటి వల్ల మయినారిటీ (లేక అల్పసంఖ్యాక వర్గాలవారు) భయపడుతున్నారు. కొన్ని సర్దుబాట్లు జరుగుతున్నాయి. సిక్కులకి సిక్కిస్తాన్ ఉంది. బయట ఎక్కడయినా సిక్కులకి ప్రమాదం వస్తే సిక్కిస్తాన్‌లో హైందవులకి దెబ్బ తగులుతుంది. ఇదే పద్ధతిమీద కేరళలో ఒక ఇస్లామిస్తాన్ కావాలని కొందరు కోరుతున్నారు. అక్కడి హైందవులు బయటి మహమ్మదీయులని రక్షిస్తారన్న మాట! శ్రీ ఫక్రూద్దీన్ ఆలీ అహమ్మద్ (పరిశ్రమల మంత్రి) బీహారులోని రాంచీలో ఒక చిన్న ఇస్లామాబాద్‌ని సృష్టిస్తున్నారు. పోయినవారం, సోమవారంనాడు రాజ్యసభలో ఆయన ఇలా అన్నారు—

## రాంచీలో ఇస్లామాబాద్

'ఆగస్టు 1967 లో హెవీ ఇంజనీరింగ్ కార్పొరేషన్‌లో మత కలహాలు జరిగాయి. అందువల్ల అక్కడ ఉద్యోగం చేస్తున్న మహమ్మదీయులందరిని సెక్టార్ 2 లోని సయిట్ 5 కి బదిలీ చేయించటం జరిగింది. అక్కడ ఉంటున్న (మహమ్మదీయులుకాని) వారిని తమఇళ్ళు ఖాళీచేసి మహమ్మదీయులకి ఇవ్వవలసినదని మేనేజిమెంట్ కోరింది.'

అక్కడ 36 ఇళ్ళు ఖాళీగా ఉన్నాయట. అందులో మహమ్మదీయులే ఉండేవారుట. మరొక 60 ఇళ్ళు దొరికితే సమస్య చాలావరకూ పరిష్కారం అయినట్లేట. మహమ్మదీయులందరూ కలిసి ఉంటే వారికి ధైర్యంగా వుంటుందిట.

36 మందికి పయిగా తమ ఇళ్ళు ఖాళీచేసి ఇస్తామని రాశారని శ్రీ అహమ్మద్ అన్నారు. అయితే, కొందరు రాజకీయ వాదుల కుతంత్రాలవల్ల ఇటువంటివారిని నిరసించేఉద్యమం ఒకటి ప్రారంభం అయిందిట.

ఇదంతా శాంతిభద్రతలకే కాక సమైక్యతా భావాన్నికూడా పెంపొందించే విధానంలో ఒక అంశం అని శ్రీ అహమ్మద్ అన్నారు.

తాము కర్మాగారంలో పనికి వెళ్ళినప్పుడు—ఇళ్ళలో వదిలివెళ్ళే తమ భార్యా బిడ్డలు సురక్షితంగా ఉండరేమోనని మహమ్మదీయ కార్మికులు, ఉద్యోగులు భయపడుతున్నారుట.

## శ్రీ గుప్త అభిప్రాయం

శ్రీ భూపేష్‌గుప్త (కుడి కమ్యూనిస్టు పార్టీ) ఈ కోరికలు సరసంగా ఉన్నాయన్నారు.

## కుట్ర

రాంచీ హె. ఇం. కార్పొరేషన్ ని నాశనం చెయ్యటానికి ఒక కుట్ర ఏమయినా బయటపడిందా అని కొందరు గుచ్చి గుచ్చి అడిగారు. కార్పొరేషన్‌లో 6 గురిమీద కేసు నడుస్తోంది కాబట్టి దానిని గురించి ప్రకటనలు చెయ్యటం సరికాదని మంత్రిగారు (శ్రీ అహమ్మద్) అన్నారు.

జనసంఘం సభ్యులు డా. భాయి మహావీర్ అడిగారు: ముద్దాయిలయిన ఆరుగురికీ పాకిస్తాన్ రాయబార వర్గంవారు సహాయం చేస్తున్నారా, అని. ఈ విచారణ అంతా రిటయిరయిన ఒక అలహాబాదు జడ్జీగారు చేస్తున్నారనీ, ఆయన రిపోర్టులో ఇటువంటిది ఏదీలేదనీ శ్రీ అహమ్మద్ అన్నారు. అంతేకాక, అటువంటి ఊహకి ఆధారమే లేదనికూడా ఆయన అన్నారు. కాని, కొందరు వదలకుండా ప్రశ్నలవర్షం కురిపించగా ఆయన కోర్టులో కొందరు ముద్దాయిలు కొన్ని విషయాలు బయట పెట్టారనీ వాటిని తాము సభలో బయట

పెట్టాలమని అన్నారు.

క్రిస్టియన్లని ఆదుకునే పెద్దమంత్రి ఎవరూ లేరు; క్రిస్టియన్ దేశాలకి సంబంధించిన వారెవరూ వారి సంగతి పట్టించుకోరు. అందుకనే జనసంఘం వారిమీద విరుచుకు పడుతోంది. వీరి వత్తిడికి లొంగి ప్రభుత్వం క్రిస్టియన్ మిషనరీ లందరినీ బహిష్కరించేయ నిశ్చయించుకుంది.

**జెస్యూటిస్తాన్?**

భారతదేశాన్ని ఒక క్రిస్టియన్ దేశం శతాబ్దం పొడుగు పరిపాలించింది. వారి పాలనలో బలవంతంగా ఇతర మతాలవారిని తమ మతంలోకి చేర్చుకోవటం జరగలేదు. హైందవులకీ క్రిస్టియన్లకీ మధ్య అల్లర్లు అరుదు. హైందవ—మహమ్మదీయుల మధ్య జరిగినటువంటివి అసలే జరగలేదు. క్రిస్టియన్లు తమకి ప్రత్యేక 'జెస్యూట్‌స్తాన్' కావాలని ఎప్పుడూ అడగలేదు.

**దేశ విచ్ఛిన్నానికి కమ్యూనిస్టుల కృషి**

కమ్యూనిస్టులు భారతదేశ విచ్ఛిన్నానికి పూనుకున్నారు. ఒక కార్యక్రమాన్ని తయారు చేసుకున్నారు.

శ్రీ నంబూద్రిపాద్ కేరళలో మోప్లాస్తాన్ సృష్టించి కేంద్ర ప్రభుత్వాన్ని బలహీనం చెయ్యటానికి ఎత్తులు వేస్తున్నారు.

కమ్యూనిస్టులను ఆశ్రయించేవారిలో ప్రముఖులయిన పండిత కేశవదేవమాలవీయా రాంచీలో ఒక మహమ్మదీయ స్థావరాన్ని సృష్టిస్తున్నారు. (ఆయన రాంచీలోని కార్పొరేషన్ అధ్యక్షులు.) పండిత మదన మోహనమాలవీయా వారణాసిలో హైందవ విశ్వవిద్యాలయాన్నీ, హిందూమహాసభనీ సృష్టించారు. ఈ తరంలో ఆయన వారసుడనతగిన ఈ పండిత మాలవీయా చిన్న ముస్లింస్తాన్ ఒకటి సృష్టిస్తున్నారు.

**రష్యా ఆదరణ**

పండిత కేశవదేవ మాలవీయాకి రష్యా ఆదరణ బాగా ఉందని వినికిడి. రష్యా చెప్పటంవల్లనే శ్రీమతి గాంధీ ఆయనని హె. ఎం. కా. అధ్యక్షులుగా నియమించారు.

**ముందు రాంచీ, తర్వాత...**

మొదటి ప్రపంచ యుద్ధంలో 'లెనిన్‌ని' రష్యాలో ప్రవేశపెట్టటానికి కారకులు కెయిసర్ విలియమ్ అంటారు. నేడు భారతదేశంలో శ్రీయుతులు ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మదీ, మాలవీయాలు రాంచీ ద్వారా భారతదేశంలో ఇస్లామిస్తాన్ స్థావరాల సృష్టికి తోడ్పడుతున్నారు. రాంచీలో స్థావరం తర్వాత ఉత్తర ప్రదేశం, రాజస్థాన్ మొదలయిన చోట్ల కూడా స్థావరాల కోసం అక్కడి మహమ్మదీయులు కోరవచ్చు. ఒకవయిపు జాత్యయికమత్యం అంటూనే మహమ్మదీయులకి ప్రత్యేక ప్రాంతాలు ఏర్పరుస్తున్నారు పెద్దలు...

**మైనారిటీల రక్షణ**

మహమ్మదీయులకి, ఇతర మైనారిటీల వారికీ రక్షణ ఇవ్వరాదని నేనటం లేదు. నేను చెప్పేది, మహమ్మదీయులకి ప్రత్యేక ప్రాంతాలు సృష్టించే బదులు జనసంఘం వారి నియంతృత్వ పద్ధతులనీ, కమ్యూనిస్టుల విచ్ఛిన్నోద్యమాన్ని అరికట్టాలి, అని.

వచ్చిన చిక్కు ఏమిటంటే కాంగ్రెసు వివిధవర్గాల పార్టీ. అందులోనే అన్ని పార్టీల నమ్మకాలు కలవారూ ఉన్నారు. అంతేకాక, కమ్యూనిస్టులకి రష్యా ఆదరణ; మహమ్మదీయులకి మహమ్మదీయ దేశాల ఆదరణ; జనసంఘంవారికి హైందవ వోటర్ల ఆదరణ ఉన్నాయి. ఎవరినని శిక్షిస్తారు?

మ్యాథిలీ ఎవరికి వారే. దేశం సంగతి ఎవరికి కావాలి? అలెక్జాండరు కాలంనుంచి నేటిదాకా విలవలేదూ... — శ్రీకృష్ణ

చిదంబరం, చూడామణి ముందుగా వచ్చారు. చంద్రరావు రావడం ఆలస్యమైంది.

'రావడం యెందుకు ఆలస్యం అయింది?' అని ప్రశ్నించాడు చూడామణి చంద్రరావు రాగానే.

'దారిలో జనం గుంపులుగా చేరి చెప్పుకొంటున్నారు ఇటుపైన ప్రభుత్వం వారు సినిమా నటీమణులకు 'ఊర్వశీ'అనే బిరుదును యిస్తారని. కొంచెం సేపు నిలబడ్డాను' అని సమాధానం యిచ్చాడు చంద్రరావు.

ప్రభుత్వం యివ్వదలచుకొన్న బిరుదు 'ఊర్వశీ' కాదు. 'పూర్వశి'అని చెప్పాడు చూడామణి.

'పూర్వశి' అంటే వేశ్యకాదా? వేశ్యపేరున బిరుదు యివ్వడమేమిటి? కళలకు అధిదేవత సరస్వతీదేవి ఉందికదా! ఆమె పేరును 'శారదా యెవార్డు'అని యివ్వవచ్చుకదా! అన్నాడు చిదంబరం.

'నీకు వచ్చిన సందేహమే నాకూ వచ్చింది. కాని యెందుకైనా మంచిదని అమరకోశం ఒకసారి చూశాను. 'స్వర్వేశ్యా ఊర్వశీముఖా'అని అందులో స్పష్టంగా చెప్పబడిఉంది. ఊర్వశి మొదలుగాగలవారు దేవవేశ్యలని దాని అర్థం.

'కళలకు అధిదేవత సరస్వతీదేవి అని అందరికీ తెలుసును. అయినా సరస్వతీదేవి హిందూదేవత కాబట్టి 'సరస్వతీ అవార్డు'అనో, 'శారదా అవార్డు'అనో అవార్డు యిస్తే సెక్యులరిజం దెబ్బతింటుందని ప్రభుత్వం భయపడి ఉంటుంది. అయినా దేవతపేరు మీద యెవార్డు యివ్వడంకంటే వేశ్యపేరుమీద యెవార్డు యివ్వడం వల్ల మన సెక్యులర్ రాజ్యాంగం బలపడుతుందని అధికారపర్గాల అభిప్రాయమై ఉంటుంది. ఒక విధంగా ఆలోచిస్తే, 'శారదా అవార్డు' అనడం కంటే 'ఊర్వశీయెవార్డు' అనడమే సరిగ్గా ఉంటుందని అనుకోవచ్చును. అన్నాడు చూడామణి.

'ఊర్వశీ యెవార్డు అంటే యే విధంగా సరిపోతుంది'?అని ప్రశ్నించాడు చిదంబరం.




'ఊర్వశీ యెవార్డును నటీమణులకు యిస్తారని కదా అంటున్నారు. 'నటి' అంటే 'వేశ్య' అనే అర్థం కూడా ఉంది. అందుచేత మా నటీమణులకు దేవవేశ్య అయిన ఊర్వశిపేరు మీద యెవార్డును యివ్వడమే సరియైనది అని కొంతమంది భావించవచ్చును' అని సమాధానం యిచ్చాడు చూడామణి.

'సినిమాతారలకు సన్మానాలు జరగడం, బిరుదులు యివ్వడం ప్రతిరోజూ మనం పేపర్లలో చూస్తూనే ఉన్నాం. ఇదివరకు సన్మానాలు చేయడం అనేది కేవలం కొంతమందికి వృత్తిగా ఉంది. కాని యిప్పుడు అది భారీపరిశ్రమగా మారిపోయింది. త్వరలోనే సన్మానకారుల సంఘాలు అనగా సన్మానాలు చేసే వారు సంఘాలుగా యేర్పడి ట్రేడ్ యూనియన్ హక్కులకోసం పోరాడే అవకాశాలు చాలా కన్పిస్తున్నాయి.'

'పిల్లల్ని కనడం, టిక్కట్టు లేకుండా రైళ్ళలో ప్రయాణం చేయడం' భారతదేశంలో జాతీయ క్రీడలని యెవరో అన్నారు. అలాగే ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులను యెగగొట్టడం, సన్మానాలు చేయడం, చేయించుకోడం, భారతదేశంలో జాతీయ పరిశ్రమలని యిప్పుడు మనం ఘంటాపధంగా చెప్పవచ్చును.' అని తన అభిప్రాయాన్ని వెల్లడించాడు చంద్రరావు.

ప్రజలు యేదో అమాయకంగా సినిమానటులకు సన్మానాలు చేస్తున్నారనుకో. కాని వాటిలో అధికారంలో ఉన్న వ్యక్తులు కూడా విరివిగా పాల్గొంటున్నారు. సినిమా తారలకు సన్మానాలు చేసే సభలకు అధ్యక్షత వహించడం తమ జన్మ హక్కు'గా మంత్రులు భావిస్తున్నారు. దానికి యేమిటంటావు? అని అని ప్రశ్నించాడు. చిదంబరం.

'ఇదివరకు సినిమారంగం, రాజకీయరంగం అని వేర్వేరుగా ఉండేవి. కాని యిప్పుడు రెండురంగాలూ కలిసి పోతున్నాయి'అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'సినిమాల్లో ఉండే సొగసుకోసం అధికారంలో ఉన్న వ్యక్తులూ, అధికారం ద్వారా పొందగలిగే పొత్తుకోసం సినిమాల్లో ఉండే వ్యక్తులూ, చెట్టు తీగల్లాగ ఒకళ్ళనొకళ్ళు పెనవేసికొని పోతున్నారు. తారా భజనలోనే అధికారంలో ఉన్న వ్యక్తులకు చాలా కాలం గడచిపోతూ ఉంది. సినిమాతారల కొంగు తగిలితే చాలు, తమ జన్మం ధన్యమైపోతుందన్నట్లు గామంత్రులు ప్రవర్తిస్తున్నారు.

అసలు సన్మానం అంటే యేమిటి? ఎందుకు చేయాలి? ఎవరికి చేయాలి? అనే విషయాల్నిగురించి యెప్పుడైనా ఆలోచించారా? అని చూడామణి ప్రశ్నించాడు.

'మేం యెప్పుడూ వాటిని గురించి ఆలోచించలేదు. అందుచేత నువ్వే వాటిని గురించి చెప్పకూడదా' అని చిదంబరం అనగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'సన్మానం అంటే గౌరవం అని అర్థం. సన్మానం చేయడం అంటే గౌరవం చేయడం అన్నమాట. ప్రజలకు ఉపయోగపడే పనిని యెవరైతే నిస్వార్థంగా చేస్తారో వారికి సన్మానాలు చేయడం బిరుదులు యివ్వడం ప్రజల యొక్క విధి.'

'గాంధి యొక్క అభిప్రాయాలు, విధానాలు కొంతమందికి నచ్చకపోవచ్చు. ఆయన కూడా యెన్నో పొరబాట్లు చేసిఉండవచ్చు. అయినా త్రికరణశుద్ధిగా ఆయన దేశస్వాతంత్రం కోసం పోరాడాడు. అందుచేత ప్రజలు ఆయనను 'మహాత్ముడు'అన్నారు బ్రహ్మరథం పట్టారు. అది ఉచితం.

అలాగే సుభాష్‌చంద్రబోస్ ప్రాణాలకు తెగించి, విదేశాలకు వెళ్ళాడు. అక్కడ యెన్నో కష్టాలు పడి, భారత జాతీయ సైన్యాన్ని నిర్మించి, భారతీయుల స్వాతంత్ర్య దీక్షను ప్రపంచానికి చాటాడు. అందుచేత ప్రజలు ఆయనను 'నేతాజి' అన్నారు. దేవుళ్ళ



పటాలతో సమానంగా ఆయన పటాన్ని పూజిస్తున్నారు. అలాగ చేయడం ప్రజల విధి'

'బార్డోలీ సత్యాగ్రహాన్ని నడిపినందుకు పటేల్‌ను 'సర్దార్'అన్నారు. సైమన్ కమిషను వచ్చినప్పుడు పోలీసుల తుపాకులకు తన గుండెలను చూపించిన ప్రకాశాన్ని 'ఆంధ్రకేసరి' అన్నారు. అది చాలా బాగుంది.

'సినిమానటులు నటనను తమ వృత్తిగా యెంచుకొన్నారు. డబ్బు తీసికొంటున్నారు, నటిస్తున్నారు. అలాంటప్పుడు వీళ్ళకు సన్మానం చేయవలసిన అవసరం ఏమిటి ఉంది'? అని ప్రశ్నించాడు చూడామణి.

'డబ్బుకోసమే నటులు నటిస్తున్నారనుకో!అయినా బాగా నటించినందుకు సన్మానాలు చేయడంలో తప్పేముంది?' అని తిరిగి ప్రశ్నించాడు చంచల్రావు.

'బాగా నటించడం వాళ్ళ బాధ్యత. అందుకోసం రెండుమూడు నెలలకు ఒకసారి వీళ్ళకు సన్మానాలు చేయనక్కరలేదు. పోస్టుమేన్ ప్రతిరోజూ సకాలానికి ఉత్తరాలు తీసికొని వస్తున్నాడు. అందుకోసం అతనికి సన్మానాలు చేస్తున్నామా? బాగా చేయడం అనేది యేపని చేసే వానికైనా ఆది బాధ్యత అవుతుంది.

ఏ దేశంలోనైనా, యేకాలంలోనైనా, వ్యక్తులతో నిమిత్తం లేకుండా, ఒకవర్గంగా, సమాజం చేత గౌరవింపబడవలసిన వర్గం ఒకటేఒకటి ఉంది. అది ఉపాధ్యాయవర్గం. కాని ఉపాధ్యాయులు నేడు సమాజంలో తగిన గౌరవాన్ని పొందగలుగుతున్నారా?' అని తన అసంతృప్తిని వెలిబుచ్చాడు చూడామణి.

'ఏం ఉపాధ్యాయులు జీతాలు తీసికోవడం లేదా? వాళ్ళకు మాత్రం యెందుకు సన్మానాలు చేయాలి?' అని ప్రశ్నించాడు చంచల్రావు.

'నీ ప్రశ్న బాగానే ఉంది కాని ఒక విషయాన్ని ఆలోచించు. నీవు యెంతడబ్బు యిచ్చినా నీ తల్లిదండ్రుల ఋణాన్ని తీర్చుకోగలవా? తీర్చుకోలేవు. అందుచేత వారిని గౌరవించడం నీ విధి. భౌతిక శరీరానికి తల్లిదండ్రులు యెలాగ కారకులో, జ్ఞానానికి అలాగ కారకుడు ఉపాధ్యాయుడు. డబ్బుతో ఉపాధ్యాయుని ఋణాన్ని తీర్చుకోలేం కాబట్టి అతనిని గౌరవించడం సమాజం యొక్క బాధ్యత. అందుచేతనే, 'మాతృదేవోభవ' 'పితృదేవోభవ' 'ఆచార్య దేవోభవ' అని ఉపాధ్యాయుడు తల్లిదండ్రుల తరువాత దైవంగా చెప్పబడ్డాడు అటువంటి ఉపాధ్యాయుడు నేడు 'బ్రతకలేక బడిపంతులు' అనే సామెతకు గురి అయాడు' అని సమాధానం యిచ్చాడు చూడామణి.

'ఒక్క సినిమా నటులనే అనడం యెందుకు? ఉద్యోగ విరమణ చేసే సందర్భంలో, ఉద్యోగస్థులకు మాత్రం సన్మానాలు జరగడం లేదా? అని ప్రశ్నించాడు చిదంబరం.

'అవును. జరుగుతున్నాయి. వాటిలో ఔచిత్యం ఉంది. చాలాకాలం ఉద్యోగం చేసిన వ్యక్తి ఉద్యోగ విరమణచేసినప్పుడు ఒకసారి కృతజ్ఞతా సూచకంగా అతనికి సన్మానం చేయడంలో తప్పులేదు. పెన్షన్ తీసికొనేవారు ప్రతినెలా తాము బ్రతికి ఉన్నట్లుగా సరిఫికేటు తీసికోవలసి ఉంది. లేకపోతే పెన్షన్ యివ్వరు. అలాగే యీ సినిమా నటులు రెండుమూడు నెలలకు ఒకసారి సన్మానం చేయించుకోవాలా? లేకపోతే ప్రజలు తమను మరచిపోతారని భయమా? అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు చూడామణి.

నాకు యిక్కడ ఒక అనుమానం వస్తున్నది. నూటికి తొంభైవంతులు సన్మానాలు యీ నటులు తాము డబ్బుయిచ్చి చేయించుకొంటున్నవే అనుకో. అయినా నూటికి పది సన్మానాలు ప్రజలు తమంతటతాము నటులకు చేస్తున్నారు. గదా! ప్రజలు ఒక ఉద్దేశంతో సన్మానం చేస్తేనటులు యింకొకవిధంగా భావించే ప్రమాదం కూడా ఉంది. ఇటువంటిదే ఒక సంఘటనకూడా జరిగింది అన్నాడు చంచల్రావు.

ఏమిటా సంఘటన? అని చూడామణి, చిదంబరం ఒకేసారి ప్రశ్నించగా చంచల్రావు చెప్పడం ప్రారంభించారు.

ఒక వూళ్ళో యెల్లయ్య, పుల్లయ్య అనేయిద్దరు వ్యక్తులు కలిసి ఉమ్మడి వ్యాపారం చేస్తున్నారు. ఒకప్పుడు పుల్లయ్య పెసలు కొనడానికిగోపాలపురం వెళ్ళాడు. అక్కడ అతనికి పెసలు దొరకలేదు. నువ్వులు చౌకగా అతనికి కనిపించాయి. వెంటనే అతడు నూరు బస్తాల నువ్వులు కొన్నాడు. ఆ మర్నాడే నువ్వులు బస్తాకు రెండురూపాయల చొప్పున ధర పెరిగింది. అప్పుడు పుల్లయ్య నువ్వుల బస్తాలు అమ్మివేసి, రెండువందల రూపాయలు లాభాన్ని సంపాదించాడు. తరువాత అతను పెసల బేరాన్నిపూర్తి చేసికొని తిరిగి వచ్చాడు. భాగస్వామి అయిన యెల్లయ్యతో నువ్వుల బేరాన్ని గురించి చెపితే అతనికి నూరు రూపాయలు వాటా యివ్వవలసి వస్తుంది. అందుచేత పుల్లయ్య యెల్లయ్యతో నువ్వుల బేరాన్ని గురించి చెప్పలేదు.

తరువాత కొద్దిరోజులకే, పుల్లయ్య బంధువుల యింట్లో పెళ్ళికి పుల్లయ్య యెల్లయ్య కూడా వెళ్ళారు. ఆ పెళ్ళిలో భోగం మేళం వుంది. పెళ్ళి సమయంలో 'ఆస్థానం' యేర్పాటు చేశారు. 'ఆస్థానం' అంటే సభ్యులు ఒక చోట కూర్చుని ఉండగా భోగంవేళం వే జావాణి చేస్తుంది. తరువాత ఒక్కొక్క వేశ్య ఒక్కొక్క సభ్యుని వద్దకు వెళ్ళి అతనికి గంధం, అత్తరువు రాసి అతనిని ఉద్దేశించి ఒక పాట పాడుతుంది. అప్పుడా సభ్యుడు ఆ పాటపాడిన వేశ్యకు రెండుమూడు రూపాయలను ఇస్తాడు.

ఆభోగం మేళంలో మధురవాణి అనే వేశ్యఉంది. ఆమెకు నత్తిఉంది. అందుచేత ఆమె యెవరి దగ్గరకూ వెళ్ళిపాటపాడలేదు. అక్కడఉన్న సభ్యులు ఆమెకూడా పాటపాడాలని పట్టుబట్టారు. అప్పుడు మధురవాణి. పుల్లయ్య వద్దకువెళ్ళి అతనికి అత్తరువు రాసింది.

తరువాత పాటపాడవలసి ఉంది కాబట్టిఆమె. 'నే చెప్తా గోపా' అనే పాటను ప్రారంభించింది. ఆమెకు నత్తికాబట్టి పాటను నేర్చుకోనేలేదు. ఏదో ఒక పాట పాడాలి కాబట్టి తాను తరుచుగా విన్న పాటను ప్రారంభించింది కాని తరువాత యేమిటి పాడాలో ఆమెకు తెలియలేదు. అందుచేత ఆమె దాని తిప్పి, తిప్పి 'నే చెప్తా గోపా, నే చెప్తా గోపా'అంటూ పాడడం ప్రారంభించింది.'

'హోహో! యీవిడకు గోపాలపురంలో నేను చేసిన నువ్వుల బేరాన్ని గురించి తెలిసి ఉంటుంది. దాన్ని పదిమందిలో చెప్పివేస్తానని బెదిరిస్తూ ఉంది. అందుచేత యీమెను మంచిచేసుకోవడం అవసరం' అని పుల్లయ్య తనలో అనుకొని, జేబులో ఉన్న పది రూపాయలూ తీసిమధురవాణికి యిచ్చాడు.

'అందరూ రెండుమూడు రూపాయలు యివ్వగా పుల్లయ్యగారు ఒకేసారి పది రూపాయలు యిచ్చారు. వీరికి ఈ పాట నచ్చి ఉంటుంది. అని మధురవాణి తనలో అనుకొంది. అందుచేత ఆమె 'నే చెప్తాగోపా, నే చెప్తా గోపా'అంటూ యింకా ఉత్సాహంగా పాడడం ప్రారంభించింది.

'ఈ పది రూపాయలు చాలవు. యింకా యివ్వకపోతే గోపాలపురం బేరాన్ని గురించి చెప్పి వేస్తానని యీమె బెదిరిస్తూంది' అని పుల్లయ్య భావించి వెంటనే తన చేతిని ఉన్న ఉంగరాన్ని కూడా తీసి ఆమెకు యిచ్చాడు.

'ఈపాట పుల్లయ్యగారికి బాగా నచ్చింది. అందుచేతనే ఉంగరాన్ని కూడా యిచ్చారు'అని మధురవాణి అనుకొంది. 'నే చెప్తా గోపా, నే చెప్తా గోపా'అంటూ ఆమె విజృంభించి డాన్సు చేయడం ప్రారంభించింది.

దానితో పుల్లయ్యకు వళ్ళు మండింది. 'చూడండయ్యా! దీనికేమైనా న్యాయం ఉందా?గోపాలపురంలో నేను చేసిన నువ్వుల బేరం గురించి యెవరితో చెప్పవద్దనేకదా నేను పది రూపాయలగా ఉంగరం యిచ్చాను. అయినా యీవిడ నన్ను బెదిరిస్తూనే ఉంది' అంటూ పుల్లయ్య కేకలు వేయడం ప్రారంభించాడు

అప్పుడు మేళ నాయకురాలు ముందుకు వచ్చింది 'ఈ మధురవాణికి నత్తిఉంది. అందుచేత యీమెకు పాటలురావు. 'నే చెప్తా, గోపాలకృష్ణా నీయమ్మతోటి నీ ఆగడాలు' అనే పాటయిది. ఈ పాటను పాడడం ప్రారంభించింది మధురవాణి. కాని పాటపూర్తిగా రాకపోవడం వలననే 'నే చెప్తా గోపా'అని



## లిట్ క్విజ్ నెం 43 — 18 క్లూలు.

1. మానవుని చింతన, కర్మ, మరియు పలుకు త్వరలోనో, నిదానంగానో విస్మయకరంగా ఖచ్చితంగా/తరచుగా తనకు తగిలివచ్చును.

2. మన జీవితంలో మనం ఏది సిద్ధిని / ప్రాప్తిని పొందుతామో నిజంగా అది దాని హద్దులోనిదే.

3. జనులను భౌతిక కానుకలమూలకంగా కొన / సంతుష్టి పర్చ నుంకించుట, దీర్ఘకాలంలో, అడుగు లేని గుంటను నింప యత్నించుట వంటిది.

4. సొమ్ముకోసం ఆత్మని ఎవరూ విడువరు / నేర్చుకోరు

5. మానవప్రాణి ఒక్కసారి నడిపిస్తే మార్పు/మోసం లేకుండా నడచిపోతుండే గడియారంకాదు.

6. మానవుడు తన కృత్యాలు / అవసరాలు అనుసారం దైవశక్తి ప్రాప్తికై ప్రార్థిస్తాడు కాని నియతి పరిపూర్తి భగవంతుని చేతులో వుంటుంది.

7. మనం ఆత్మ విశ్వాసభావానికి/మత భేదానికి అలవాటుపడే అవకాశాన్నిచ్చేయెడల అది మనపట్ల మనలోగల శక్తుల పట్ల అన్యాయం.

8. మనలోగల రిక్తత/మనశ్శాంతిలేమి గణించుటకు నీరసత రూఢియైన విధానాలలో నొకటి!

9. పనికోసం పని, ధనంకోసం ధనం, ఉత్పాదన కోసం ఉత్పాదన — ఇవి 20 వ శతాబ్ద మందలి అత్యంత గొప్ప భ్రాంతులు / తరంగాలు అయివున్నవి!

10. పురుషులు తమ తప్పిదములకు/ భావనలకు సామాన్యంగా స్త్రీల కంటే ఎక్కువగా భయపడుదురు.

11. మానవునికి కేవలం తాను ఇచ్చేది / సంకల్పించినది లభిస్తుంది.

12. మన కృతజ్ఞతా / అపరాధ కృత్యాలను నెమ్మదిగా తగ్గించజాలదు.

13. అందరూ లేక చాల మంది మానవులు సర్వదా అనుగుణ్యంగా మానవత / బుద్ధిస్థిరత గలిగియుండుట చాల అసంభవం అనిపిస్తుంది.

14. చాలా మంది జనులు కలుపుగోరితనంగా నుండుట ఎరుగరు. అందుచే వారు మానభంగ / ఏకాంతతా బాధను అనుభవిస్తారు.

15. ఉపేక్ష / అన్యాయం మానవతకు అంత్య నిషేధం.

16. కళ స్వయంకృత పూర్ణత / ప్రకటీకరణయందు ఆడంబరమైనదికాదు. అది గుప్తమై వుంటుంది మరియు స్వయంగా బహిర్గతం గాకుండా తన ప్రభావమును వెలిబుచ్చుతుంది.

17. తుదకు యౌవనం ఏమిటి, అంతే చంచలమతి మరియు మృదుల శరీరం దురాగ్రహం/గర్వం మరియు శారీరక నిర్లక్ష్యత గాక వార్ధక్యం ఇంకేమిటి ?

18. వివేకం నిద్రించునప్పుడు అసంగతమైన ఘృణాయుత మూఢనమ్మక ప్రాణి / సంశయం మేల్కాంచి తన కెరయైన వారికి నీచ ఉన్మత్తతను ప్రేరేపించును.

## No. 43: 18 CLUES

1. Man's thoughts, deeds, and words return to him, sooner or later, with astounding **Accuracy / Frequency**.
2. There are, of course, limitations to what we can **Achieve/ Receive** in our lives.
3. Trying to **Buy / Satisfy** people with material gifts is, in the long run, like trying to fill a bottomless pit.
4. One does not **Cease / Learn** to have a drive for money.
5. A human being is no time clock which, once it is set, cannot **Change / Cheat**.
6. Men evoke God's activity according to their **Deeds / Needs**, but the fulfilment of his oly will be the work of God.
7. It is an injustice to ourselves and the powers within us if we allow **Diffidence / Dissent** to become a habit.
8. Boredom is one of the sure ways to measure your own inner **Emptiness / Restlessness!**
9. Work for work's sake, money for money's sake, production for production's sake — these are the greatest **Fallacies / Fancies** of the twentieth century!
10. Men are usually more afraid of their **Faults / Feelings** than women.
11. Man receives only that which he **Gives / Wills**.
12. Time does not diminish our feelings of **Gratitude / Guilt**
13. That all, or even most, human beings will ever be consistently **Human / Sane** seems very unlikely.
14. Many people do not know how to be social, and that is why they suffer the pangs of **Humiliation / Isolation**.
15. **Indifference / Injustice** is the final denial of humanity.
16. Art in its **Perfection / Revelation** is not ostentatious; it lies hid and works its effect, itself unseen
17. What is youth, after all but a flexible mind and a flexible body; what is age but **Prejudice / Pride** and physical neglect?
18. When reason sleeps, the absurd and loathsome creatures of **Superstition / Suspicion** wake and are active, goading their victim to an ignoble frenzy.

**గమనిక:** పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్ క్విజ్ చిక్కీలో ప్రచురించబడును.

## ముగ్గురు మూర్ఖులు

అని, ఆగిపోయింది. అంతే తప్ప మాకు దురుద్దేశం యేమీలేదు.' అని ఆమె అందరికీ చెప్పింది.

పుల్లయ్యేమో పాటపాడవద్దని డబ్బు యిచ్చాడు. కాని పాట పుల్లయ్యకు నచ్చిందని అనుకొంది మధురవాణి, ఒకళ్ళనొకళ్ళు అపార్థం చేసికొన్నారు గదా!

కొన్ని కులాల్లో ఒక ఆచారం ఉంది. ఇంటికి వచ్చిన చుట్టాలు యెంతకీ వెళ్ళిపోకపోతే యింటివాళ్ళుపిండివంట చేస్తారు. ఆపిండి వంటను తిని వెళ్ళిపొమ్మని దానికి అర్థం. ఆ చుట్టాలు దానిని గ్రహించి వెళ్ళిపోతారు.

అలాగే 'హో నటులారా! మీరు యింతవరకూ చేసిన కళాసేవచాలు. ఇంక మీరు రంగంనుంచి తప్పుకోవడం మంచిది. తద్వారా మీరు కళకు, ప్రజలకు కూడా 'సేవచేసిన వారు కాగలరు' అని ప్రజలు అనుకొని నటులకు సన్మానాలు చేస్తూ ఉండవచ్చును.

'హోహో! నా నటన ప్రజలకు బాగా నచ్చింది. అందుచేతనే వాళ్ళు నాకు సన్మానాలు చేస్తున్నా'రనుకొని యీ సినిమానటులు మరింత విజృంభించి నటిస్తూ ఉండవచ్చును. ఇక్కడ ప్రజలూ, నటులూ ఒకరినొకరు అపార్థం చేసికొనే అవకాశం ఉందికదా!' అని చంద్రరావు నువ్వులబేరపు కథను పూర్తి చేశాడు.

ఇంతకూ వీరబలుడు యిప్పుడు లేనందుకు నేను చాలా విచారిస్తున్నాను. అని చూడామణి అనగా, వీరబలుని కథ యేమిటి? అని ప్రశ్నించాడు చంద్రరావు.

ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. వీరబలుని గురించి తరువాత మాట్లాడుకొనవచ్చునంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

ఇతనేనోయ్! ప్రముఖగాయకుడు'



LitQuiz No. 43

Rs. 41,000

FIRST PRIZE Rs. 21,000 • ALARM CLOCK IN MINIQUIZ

15 LANGUAGES 150 AGENTS 245 PERIODICALS FOR PUBLICITY

SEE ENTRY FORM IN BLITZ

GIFT OF A CALENDER

ASK FOR A FREE COPY OF LITQUIZ WEEKLY

LITQUIZ PRIVATE LTD. BOMBAY-7

నెం. 41 లో ఆల్ కరెక్ట్స్ — విజేతలు 6 గురు ఒక్కొక్కరు రు. 3500 పొందిరి. మినిక్విజ్ లో గెలుపొందిన 50 మంది ఒక్కొక్కరు ఒక రిస్ట్‌వాచి పొందిరి.

## క్యాలెండరు బహుమతి

4 కూపనులు పంపే పోటీదారు అందరు పోస్టుద్వారా క్యాలెండరు పొందుటకై తన అడ్రసుగల కాగితమునకు 15 పైసల స్టాంపు అంటించి తప్పకుండా పంపవలెను.

## లిట్ క్విజ్ నెం. 43 అధికార ఎంట్రీ ఫారము

**ఆఖరు ముగింపు తేదీ 25-12-68 బుధవారం**

**ADDRESS: LITQUIZ No. 43, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)**

గమనిక: (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమువకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్‌చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 43, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| No. | 1 Re. 1 | | 2 Re. 1 | | 3 Re. 1 | | 4 Re. 1 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACCURACY | FREQUENCY | ACCURACY | FREQUENCY | ACCURACY | FREQUENCY | ACCURACY | FREQUENCY |
| 2 | ACHIEVE | RECEIVE | ACHIEVE | RECEIVE | ACHIEVE | RECEIVE | ACHIEVE | RECEIVE |
| 3 | BUY | SATISFY | BUY | SATISFY | BUY | SATISFY | BUY | SATISFY |
| 4 | CEASE | LEARN | CEASE | LEARN | CEASE | LEARN | CEASE | LEARN |
| 5 | CHANGE | CHEAT | CHANGE | CHEAT | CHANGE | CHEAT | CHANGE | CHEAT |
| 6 | DEEDS | NEEDS | DEEDS | NEEDS | DEEDS | NEEDS | DEEDS | NEEDS |
| 7 | DIFFIDENCE | DISSENT | DIFFIDENCE | DISSENT | DIFFIDENCE | DISSENT | DIFFIDENCE | DISSENT |
| 8 | EMPTINESS | RESTLESSNESS | EMPTINESS | RESTLESSNESS | EMPTINESS | RESTLESSNESS | EMPTINESS | RESTLESSNESS |
| 9 | FALLACIES | FANCIES | FALLACIES | FANCIES | FALLACIES | FANCIES | FALLACIES | FANCIES |
| 10 | FAULTS | FEELINGS | FAULTS | FEELINGS | FAULTS | FEELINGS | FAULTS | FEELINGS |
| 11 | GIVES | WILLS | GIVES | WILLS | GIVES | WILLS | GIVES | WILLS |
| 12 | GRATITUDE | GUILT | GRATITUDE | GUILT | GRATITUDE | GUILT | GRATITUDE | GUILT |
| 13 | HUMANE | SANE | HUMANE | SANE | HUMANE | SANE | HUMANE | SANE |
| 14 | HUMILIATION | ISOLATION | HUMILIATION | ISOLATION | HUMILIATION | ISOLATION | HUMILIATION | ISOLATION |
| 15 | INDIFFERENCE | INJUSTICE | INDIFFERENCE | INJUSTICE | INDIFFERENCE | INJUSTICE | INDIFFERENCE | INJUSTICE |
| 16 | PERFECTION | REVELATION | PERFECTION | REVELATION | PERFECTION | REVELATION | PERFECTION | REVELATION |
| 17 | PREJUDICE | PRIDE | PREJUDICE | PRIDE | PREJUDICE | PRIDE | PREJUDICE | PRIDE |
| 18 | SUPERSTITION | SUSPICION | SUPERSTITION | SUSPICION | SUPERSTITION | SUSPICION | SUPERSTITION | SUSPICION |

No. 43 SEND FOUR COUPONS & ENTER MINIQUIZ FREE

4 కూపనులు పంపి, ఉచితముగా ఒక క్యాలెండరు పొందండి

12 CLUES FREE COUPON

MiniQuiz

| | | | |
|---|---|---|---|
| DIFFIDENCE | DISSENT | HUMANE | SANE |
| EMPTINESS | RESTLESSNESS | HUMILIATION | ISOLATION |
| FALLACIES | FANCIES | INDIFFERENCE | INJUSTICE |
| FAULTS | FEELINGS | PERFECTION | REVELATION |
| GIVES | WILLS | PREJUDICE | PRIDE |
| GRATITUDE | GUILT | SUPERSTITION | SUSPICION |

43 (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/— M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం. ............

CAPITAL LETTERS

NAME ..................................................

ADDRESS ..................................................

..................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను.

ఆఖరు ముగింపు తేది: 25—12—68.

సొల్యూషన్ ఆంధ్రప్రభ:29—12—68.

* సొల్యూషన్ వెంటనే తెలుసుకొనుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను.

* లిట్‌క్విజ్ వీక్లీ 8 సంచికలకు రు.2/— పంపవలెను.

## సమస్యకి భయపడి ఆత్మహత్య

కన్ననల్లూరుకు చెందిన రంగస్వామి అనే అతను రాజాపురం అనే వూళ్లో సైకిలుమీద పోతూ ఒక కుర్రాడిమీద పడ్డాడట. విధి వశాత్తు ఆ కుర్రాడు చనిపోయాడట. ఈ కేసు విచారణకు వచ్చి కోర్టు రంగస్వామికి "సమన్సు" పంపేసరికి, కోర్టు తీర్పుకు భయపడి రంగస్వామి ఆత్మహత్య చేసుకున్నాడట. దూలానికి పురేసుకు చనిపోయాడట.

## ఉం ఫ్రా ఊం!

ఆంధ్రదేశంలో 1200 స్వల్పంకు పశు సంపర్క కేంద్రా లున్నాయని పశు సంవర్థక శాఖ డైరెక్టర్ డాక్టర్ శ్రీ కృష్ణారావు గారన్నారుట. గాంధీ శత జయంతి సందర్భంగా యీ సంవత్సరం నవంబర్ 12 వరకూ విధింపబడిన మరణశిక్షలన్నిటినీ ప్రభుత్వం రద్దు చేస్తోందట. విద్యావిధానంలో జరిగిన




మార్పులవల్ల ప్రభుత్వం రాబోయే సంవత్సరం నుంచీ 11వ తరగతి ఎత్తేస్తోందనీ, తద్వారా 273 బి.యి.డి. ఉపాధ్యాయులకు ఉద్యోగనష్టం కలుగునని నియుంగా తెలిసింది. భారత జనాభా 1971 నాటికి 56,30,00,000 అవుతుందని అంచనా వేశారు. 1881లో 23 కోట్ల 47లక్షల 58 వేలుందనీ, అది 1961 నాటికి 43,92,33,000వుందనీ యీ లెక్కలను పోతే ప్రమాదమనీ ఆ సంస్థ వ్యాఖ్యానించింది. మద్రాసులో వున్న బిచ్చగాళ్లకు టాక్సీమీద వచ్చి, చేతికి అందినవన్నీ నోట్లు బిచ్చగాళ్లకు ఒక అజ్ఞాత వ్యక్తి పంచి పెడుతున్నాడని, అతని ఆరాలు తీసింది పోలీసు. అతను అమెరికానుంచి వచ్చాడనీ, దురుద్దేశంతో గాక, బీదలమీద జాలిపడే యిస్తున్నాడని తేల్చి అతనిమీద చర్య తీసుకో వలసిన అవసరం లేదని తేల్చారు. అతనిప్పుడు మద్రాసు వదిలి, కలకత్తా వెళ్లాడట.







# 1969లో మీ రాశిఫలం!

## 5. సింహం

ప్రతిసంవత్సరం జూలై 23వ తేదీ నుంచి ఆగస్టు 22వ తేదీవరకు సాయన సూర్యుడు సింహ రాశియందు ఉంటాడు కాబట్టి యీ తేదీలమధ్యను జన్మించిన వారు సింహరాశియందు జన్మించినవారుగా పరిగణింపబడుతున్నారు.

సింహరాశియందు జన్మించినవారికి యీ సంవత్సరం ప్రారంభంలో బాగా ఉండదు. కాని రానురాను అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారాలవల్ల మున్ముందు ప్రయోజనం ఉంటుంది. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి యిది సమయం కాదు.

ఉద్యోగాన్వేషకుల ప్రయత్నాలు సంవత్సరం మధ్యలో ఫలించగలవు. అవివాహితులకు సంవత్సరం ఆఖరులో వివాహాలు జరగవచ్చును. విద్యార్థులకు మార్చి పరీక్షలకంటే సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

### జనవరి

ప్రతి వ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతూనే ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం తగదు. ఉద్యోగంలో సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

### ఫిబ్రవరి

ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరు వరకు నిలవదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఆర్థిక వ్యవహారాలు యిదివరకుకంటే బాగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో అనుకూలమైన మార్పుల వస్తాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.

### మార్చి

ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు రావచ్చును. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో యితరుల జోక్యం వలన ఆలస్యం జరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాట్లవల్ల యిబ్బంది కలుగుతుంది. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

### ఏప్రిల్

మీరు యిప్పుడు జరిపే ప్రయత్నాలవల్ల మున్ముందు చాలా ఉపయోగం ఉంటుంది. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వ్యాపారంలో మీకు నష్టం కలిగించడానికి యితరులు చేసే ప్రయత్నాలే మీకు అనుకూలంగా మారగలవు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### మే

ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. మంచి మాటలతో మిమ్మల్ని పెడదారులను తొక్కించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

### జూన్

వ్యాపారంలో పోటీవారితో పోటీనియెదుర్కొని అనుకూలతను సాధించగలరు. రావలసిన డబ్బు సమయానికి అందక పోయినా, యేదోఒక విధంగా అన్ని వ్యవహారాలను సరిపుచ్చుకొనగలరు. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

### జూలై

కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తి వ్యాపారాల్లో మీరు శ్రమపడినా ప్రయోజనం ఉండదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. మీరు యిదివరకు జరిపిన ఆర్థిక వ్యవహారాలవల్ల యిప్పుడు యిబ్బంది కలుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది.

### ఆగస్టు

అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. ఆర్థిక వ్యవహారాలు యిదివరకటికంటే బాగా ఉంటాయి. ఉద్యోగంలో మీ శక్తి సామర్థ్యాలు అధికారులచేత గుర్తింపబడగలవు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### సెప్టెంబరు

వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వృత్తిలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో యిదివరకు మీకు యేర్పడిన సందేహాలు తొలగిపోతాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

### అక్టోబరు

వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వృత్తిలో యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

### నవంబరు

కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో మొగమాటాలకు లొంగిపోవడం వలన శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి శ్రమమీద ఫలిస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

### డిసెంబరు

వృత్తివ్యాపారాల్లో మీరు యిప్పుడు జరిపే వ్యవహారాలవల్ల మున్ముందు కూడా ఉపయోగం ఉంటుంది. సాహసం తోకూడిన వ్యవహారాలు కొంత వరకు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. అలంకార వస్తువులు కొంటారు.

## 6. కన్య

ప్రతి సంవత్సరం ఆగస్టు 23 వ తేదీ నుంచి సెప్టెంబరు 22 వ తేదీవరకు సాయన సూర్యుడు కన్యారాశియందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు కన్యారాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు.

కన్యారాశియందు జన్మించినవారికి యీ సంవత్సరంలో అప్పుడప్పుడు యిబ్బందులు కలిగినా, సంవత్సరం ఆఖరుకు వృత్తి వ్యాపారాల్లో తగినంత అభివృద్ధిని సాధించగలరు. సంవత్సరం ఆఖరులో ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి.

ఉద్యోగాన్వేషకులకు తాత్కాలికోద్యోగాలు లభించగలవు. అవివాహితుల వివాహ ప్రయత్నాల్లో కొత్త సమస్యలు తల యెత్తగలవు. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కాగలరు.

### జనవరి

భవిష్యత్తులో మీకు ఉపయోగించగల వ్యవహారాల్లో గౌరవ చూపించవలసిన సమయం. వ్యాపా

లంతో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. శుభ కార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### ఫిబ్రవరి

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు అనుకోని మార్పులు వస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో యితరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగ తుంది.

### మార్చి

ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్పుకొంటారు. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగు తుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంటారు.

### ఏప్రిల్

కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా, ప్రయోజనం ఉండదు. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలి వేయడం మంచిది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరుల జోక్యం వలన నష్టం వస్తుంది.

### మే

ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో సాటి వారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించ గలరు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. బంధు మిత్రులను కల్పు కొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి.

### జూన్

వృత్తిలో మీకు ముమ్మందు ఉపయోగించ గల సంభాషణలను జరుప గలరు. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఇదివరకు మీ యెడల ముభావంగా ఉన్నవారు కూడా యిప్పుడు మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. బంధువులకు సహాయం చేయ గలరు.

### జూలై

వ్యాపారంలో మీ ఆలోచనలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించ గలవు. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించ గలదు. అలంకార వస్తువులు కొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

### ఆగస్టు

మీరు యెంతో కృషి చేసి ఒక దారికి తెచ్చిన వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. ఉద్యోగంలో మీరు అపోహలకు గురి కాగల ప్రమాదం వుంది. ఆరోగ్యం బాగా ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడినా మాట దక్కదు.

### సెప్టెంబరు

వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగి పోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. శుభ కార్యాల విషయంలో బంధువుల సహకారం లభిస్తుంది. నూతన విషయాలను తెల్పు కొంటారు.

### అక్టోబరు

భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. కుటుంబ సంతోషం లభించ గలదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### నవంబరు

కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం వలన కార్యభారం పెరుగు తుంది. వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. సాంఘిక కార్యక్రమాల్లో మెప్పుకు రాని బాధ్యతను వహిస్తారు.

### డిసెంబరు

సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించ గలరు. దైవకార్యాలు నెరవేరుతాయి. కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి.

(పైవారం తుల, వృశ్చికం)

—మహేష్



SWASTIK

జి. ఆర్, బాలసోర్

అక్కా, నిజమైన మానవుడెవడు?

తన ఉనికి వల్ల ఇతరులకు కష్టం కలిగించని వాడు.

మంచేమిటి? చెడేమిటి?

మానవ నైజంలోని— కళకళలే మంచిచెడూ.

కె. ఎమ్. ఆర్, పోతంగి

మీరు ప్రశ్నలకు ఇచ్చిన జవాబులు చాలా బాగుంటున్నాయి. మరి మీకో?

కాకిపిల్ల కాకికి ముద్దు కదా? వేరే అడగాలా బ్రదర్.

ఆర్. ఆర్. ఆర్, చిరతపూడి

మీరు చిన్న చిన్న వ్యాసాలువ్రాయడం తప్ప సీరియల్సు ఏమీ వ్రాయడంలేదా?

ప్రస్తుతానికి లేదు. చిన్న వ్యాసాలు రాయడం సరదా నాకు.

బి. ఎన్, విశాఖపట్నం

'అణిముత్యం'లాంటి నువ్వు 'మెరుపు తీగలా' మెరిశావు. నా 'హృదయం చిగిర్చింది. 'నీదే నా హృదయం'

జాగ్రత్త తమ్ముడూ, అది 'మానని గాయం'గా మారేను!

రత్నశ్రీ, బరంపురం

మరుగునపడిన మానవజీవితానికి వెలుగు నిచ్చే వెన్నెల ఏది?

ఉత్సాహం.

తాళిబొట్టులేకుండావే తల్లిగామారిన స్త్రీకిసంఘంలో స్థానంవుందంటారా?

లేకేం! ఉంటూనే ఉంటుంది.

సి. ఎస్. పి, పిడపర్రు

మనిషి ఎక్కువకాలం జీవించాలని కోరుకుంటాడు ఎందువలన?

జరిగిపోయిన కాలం కంటే రాబోయే కాలం బాగుంటుందన్న ఆశ చేత.

కె. ఏ. రెడ్డి, హైదరాబాదు

కె. రామలక్ష్మిగారూ, మీ రచనలకు సినిమాకథలకు అవినాభావ సంబంధం ఉంటుందేమిటి? వాస్తవానికి ఎంతో దూరంగా ఉంటాయి కారణం సెలవిస్తారా?

ఏముందీ, వాస్తవికత అంటే నాకు భయం కాబోలు!

ఎల్. కె. ఆర్, అనపర్తి

రామలక్ష్మమ్మగారూ భగవంతునిపై భక్తి కలుగవలయునన్న ఏమిచేయమంటారు?

ఏకాగ్రత ఉంటే తప్పించి ఓ క్షణం గూడా దైవంపై మనసు నిలపలేరు. ముందు అది అలవాటు చేసుకోండి.




ఎన్. పి. ఎమ్. ఆర్. యాడికి, అనంతపురం

'భార్య రూపవతీ శత్రుః' అని ఆర్యులు బోధించారుకదా, మరిరూపానికే ప్రాధాన్యం యిచ్చే ఈ రోజులలో మీ ఉద్దేశ్యం ఏమిటి?

వెల ములకం అని గుడ్డిదాన్ని పెళ్ళాడితే రోజుకి ఆవం కుండలు పగల కొట్టిందట. అలా వుంది. పెళ్ళి చేసుకోక ముందు భార్య కాదు కనుక అందం కోరుతాడు. తరవాత అది కాస్తా పోవాలంటే ఎలా శత్రువని. సద్దుకోవడమే— కొందరు అందమైన భార్యని గొప్పగా చెప్పుకుంటారు. కొందర బయటికే రానివ్వరు. ఇది మగవాళ్ళకి చెప్పినది కాదు. ఆడవారికి చెప్పిన సంగతని నా అనుమానం. భార్య రూపవతిగా ఉంటే బాధ పడతారు జాగ్రత్తగా మసులుకోమనేమో.

పి. ఎస్. ఆర్. రాజమండ్రి

శరీరం అతిగా పెరిగిపోకుండా ఉండడానికి ఆహారం మొదలైనవాటిలో ఎటువంటి నియమాలు పాటించాలి?

లాభం లేదు చెల్లెలా— నిశ్చింతగా తింటూ, రావాలనుకున్న ఒంటిని రానివ్వడమే మంచిది!

సి. ఆర్. ఎస్ ఆర్, కర్నూలు

నాకు యోగాభ్యాసం ఆసనాలువేయుట మొదలగు వాటిని తెలిపే పుస్తకాలు లభించే చోటు తెలుపుతారా?

ఏ ప్రముఖ పుస్తకశాలలో నైనా దొరుకుతాయి. లేకుంటే బుక్‌సెంటర్, మౌంట్ రోడ్ మద్రాసు, లేదా హిగిన్ బాతమ్స్, మద్రాసు వారికి వ్రాయండి.

బి. ఎల్. పి, విజయవాడ

ప్రతి చిన్నవిషయానికి వాదులాడుకొనే భార్యాభర్తలపై మీ అభిప్రాయం ఏమిటి?

మూగనోము పట్టి బిగుసుకుపోయిన కంటే వాదులాడుకొనే వారే వేయి రెట్లు మెరుగు'

జె. ఆర్. సి, నాగపూరు

కాలానికి కట్టుబడి పరిస్థితులలో ఇరుక్కుపోయి నిస్సహాయకుడైన వ్యక్తిత్వాన్ని లోకం సామాన్యుడిగా అర్భకునిగా అసమర్థునిగా ఎంచుతుంది ... మరి మీరే విధంగా ఆ వ్యక్తిని...

పిలుస్తారనా? 'వ్యక్తిత్వంలేని మనిషి'అందామా? చేతకానివాడు అంటే బాగుండదేమో.

పి. ఏ, చీరాల

ఆడవాళ్ళ మనస్తత్వం అర్థం చేసుకొన్నంత త్వరలో అర్థం చేసుకోలేరు. కారణం?

ఆడవాళ్ళు కనుక.

ఎన్. పి, జగిత్యాల

ప్రస్తుతం పురుషుల సమస్యలకంటే స్త్రీల సమస్యలే ఎక్కువ అగుతున్నాయి. దీనికి కారణం ఏమిటండీ?

ఏముందీ పురుషులు!

ప్రభుత్వోద్యోగులకు ఇద్దరు భార్యలుండరాదన్న నిబంధన యున్నది కదా? దానిని సడలిస్తే స్త్రీ వివాహ సమస్య కొంతవరకు చక్కపడవచ్చును కదండీ?

పోనీ బహుభార్యాత్వాన్నే తిరిగి అమలులోకి తెచ్చేస్తే ఇంకానయంకదండీ శ్రీరాజాగారూ, హాయిగా ఏ ఒక్కడైనా పది మందిని ఉద్ధరించవచ్చు!.... సమస్యల పరిష్కారానికి పూర్వ సంప్రదాయాల పునరుద్ధరణ కానే కాదు దారి.

కె. ఎమ్. ఆర్, పోతంగి

మానవులలో మానవత్వం నశించిన తరువాత మరల చిగురించ కలదా?

తప్పకుండా చిగురిస్తుంది— తగిన దోహదం సమకూరుతే.

ఎస్. ఎస్, తణుకు

...ఇటువంటి విషజాడ్యము తలెత్తకుండా ఉండాలంటే అన్ని మందులలాగే వీటిని డాక్టరు చీటీ ఉంటేనే అమ్మేట్టు చేస్తే మంచిది. మీరేమంటారు?

మీతో ఏకీభవిస్తాను. కాని ఒకటే చిక్కు. ఇటువంటి విషయాలపట్ల పురుషులు అశ్రద్ధవహించడం వల్లనే స్త్రీలు బాధపడుతున్నట్టుతోస్తుంది. ఏమైనా వస్తే, తెలుసుకోవాలంటే, భర్తభార్యనితోలు తాడే గాని తిన్నగా డాక్టరు దగ్గరికి తానురాడు. ఇది రెండు నెలలపాటు అయిదారు కుటుంబ నియంత్రణ కేంద్రాల్లోచూసిగ్రహించిన సత్యంఅంటే నమ్మండి.



## 7 రోజులలోనే సీత తన చర్మమును స్వచ్ఛంగా, మనోహరంగా చేసుకొన్న కథ!

# 7-రోజుల పాండ్స్ సౌందర్య చర్య యొక్క చమత్కారము



కాలేజి సోషల్‌కి ఇంక 7రోజులే వున్నాయి! కాని, ఎండి వాడిపోయిన చర్మముతో పార్టీకి ఎల్లాగ వెళ్లగలుగుతాను అని చింత కలిగింది. అదృష్టవశాత్తు 7రోజుల పాండ్స్ సౌందర్య చర్యను గురించి విన్నాను.



ఒక వారం రోజుల పాటు, రాత్రి పడుకునే ముందు పాండ్స్ కోల్డ్ క్రీమను రెండు పార్లు నా ముఖానికి రాసుకున్నాను. మొదటి సారి రాయడంతో పైమురికి, మేక్-అప్ తొలగిపోతాయి.



తరువాత మెత్తటి టిస్యూ పేపర్‌తో గాని, గుడ్డతో గాని క్రీమను తుడిచి వేశాను.



రెండవసారి నా ముఖానికి యింకా క్రీమ్ రాసుకొన్నాను. నిజానికి యిదే సౌందర్య రహస్యము. ఎందుకంటే, ఈ సారి క్రీమ్ చర్మములోకి పోయి మరుగు పడివున్న మురికిని, తొలగించును.




7 రోజుల తరువాత, పార్టీలో నా చర్మము అత్యద్భుతంగా, స్వచ్ఛంగా మెరిసిపోయింది! ఇప్పుడు ప్రతి రోజూ పాండ్స్ కోల్డ్ క్రీమ్‌తో చర్మాన్ని శుభ్ర పరుస్తున్నాను. అందు వలననే, నా ముఖ వర్చస్సు ఎల్లప్పుడు స్వచ్ఛంగా, మనోహరంగా కనబడుతుంది.

# పాండ్స్
## కోల్డ్ క్రీమ్

ఇది ప్రపంచములో అత్యధికంగా అమ్ముడయ్యే చర్మమును శుభ్రపరచే క్రీమ్

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

పెద్ద కథ




(గత సంచిక తరువాయి)

మూర్తి నరసింహం వెళ్ళిన వైపు చూస్తూ రెండు నిమిషాలు నిలబడ్డాడు. జేబు లోంచి రుమాలుతీసి మొహంతుడుచుకున్నాడు. దేహమంతా గ్రాపుని చేత్తో దిద్దుకున్నాడు. కాలరు సర్దుకుని ఏదో పనున్న వాడిలా మళ్ళీ బయల్దేరాడు ఆ యింటివైపు. ఆ అమ్మాయి అక్కడే వుంది. మూర్తి ఎంత నెమ్మదిగా నడచినా యిల్లు దాటి పోయింది. అరగంటలో అరవైసార్లు అటూ యిటూ తిరిగాడు ... ప్రక్కనేవున్న కిళ్ళీకొట్టు వాడు తనవంకే చూస్తున్నట్లు 'ఫీల'య్యాడు. అట్టప్రక్క, మిషనుకొట్టు వాడుకూడా అట్లాగే చూస్తున్నాడు. ఏదో పనిమీద పోతున్నవాడిలా తొందరగా పోతున్నా వాళ్ళు నవ్వుకుంటున్నట్లని పించింది... 'వెధవలు... ఔత్సాహిక పత్తేదారులు' అని తిట్టుకున్నాడు మూర్తి...వాళ్ళకోసమన్నా తనేదైనా పనని కల్పించుకోవాలి. ఏంపని?... వక్కపొడి పొట్లం...'రైట్... వక్కపొడి పొట్లాలు కొనొచ్చు' అనుకున్నాడు. తడవకో వక్కపొడి పొట్లం కొనటం మొదలు పెట్టాడు...

జేబంతా వక్కపొడి పొట్లాలతో నిండి పోయింది. వరండాలో అమ్మాయి యింత సేపూ మంచోలేక స్టూలుమీద కూర్చుంది. 'సారీ' అనుకున్నాడు మూర్తి... యిలా ఏడున్నరగంటలవరకూ పహరా యిచ్చాడు. కొంతసేపటికి కాళ్ళు నొప్పులు పుట్ట సాగినయ్...బూట్లు చాలా బరువుగా కని పించినయ్. యివాళ్టికి గస్తీ చాలను కున్నాడు. యింతలో వరండాలో కూర్చు న్నమ్మాయి లోపలికెళ్ళింది.

'ఛ...మొదట్లోనే విసుగుపుట్టించాను' అనుకున్నాడు మూర్తి. తన్నుతాను తిట్టు కున్నాడు...కానీ యింకో రెండు నిమిషాల్లో ఆ అమ్మాయి ఓపదేళ్ళ కుర్రాణ్ణి తీసు కుని బయటకొచ్చింది పాడుతూ. పాట స్పష్టంగా విన్నాడు—'యుఆర్ సెవెంటీన్... గోయింగాన్ ఎ యి టీ న్...' అంటూ పాడ్తోంది. 'వెంట వెడదాం' అనుకున్నాడు మూర్తి...'వెళ్ళి ఏంచెయ్యాలి?' ... ఏం తోచలేదు. 'ఈలవేస్తే?' అనుకున్నాడు. 'ఛ...రౌడీ ననుకుంటుంది' అనుకున్నాడు. 'పోనీ ఆ అమ్మాయి రుమాలేదన్నా క్రింద పడేస్తే బాగుండును' అనుకున్నాడు. అమ్మాయిచేతిలో రుమాలులేదు...

'గుడికెళ్ళి వొచ్చేద్దాంరా తమ్ముడూ' అంది అమ్మాయి. ఆమె యెందుకందో మూర్తికి తెల్సు. కానీ ఆమె యిన్స్ట్రక్షన్ ప్రకారం వెళ్ళేందు కెందుకో వెనకాడాడు. కాళ్ళు తడబడ్డాయి. అమ్మాయి వెళ్ళి పోయింది... తిరిగి వచ్చేవరకూ అక్కడే వున్నాడు. గేటు తీసుకుని లోపలికెడ్తూ, గేటువేస్తూ తాతాసేపు గేటుదగ్గరే నిం బడింది. 'ఛ...నేనొట్టి ఫూల్‌న'నుకున్నాడు మూర్తి. గేటువేసి లోపలికెడ్తూ 'బినాకా పెంటూతా; సార్' అంది. మూర్తి నవ్వాడు. 'చీకటిగా వుంది, నవ్వు కనిపించదు. విని పించేలా ఏదన్నా అందా, మను'కుంటూగొంతు లోంచి మాటరాలేదు. తొప్పవు నరసింహాన్ని తిట్టాడు మూర్తి—'గాడిద, సమయానికి తగలడ్డు' అంటూ ... యింకాస్సేపట్లాగే తిరిగి రూంచేరుకున్నాడు. తొమ్మి దయింది. కాళ్ళునొప్పులు పుడ్తున్నయ్. రూంకు చేరుకున్నాడు. వక్కపొడిపొట్లాలన్నీ ఎదురుగావున్న టేబిలుమీదపోసి వాటివంకే చూస్తూ మడతకుర్చీలో పడుకున్నాడు... ఎప్పుడు నిద్రపట్టిందో ఏమో, నరసింహం వచ్చి—

'పక్షి! యూనిఫారంలో నిద్దరేంట్రా' అనేటప్పుడు మెలకువ వచ్చింది మూర్తికి.

'సింహం! నీఅంత మిత్రద్రోహి యింకో డుండడురా. యింకోఛాన్సు పోయింది, వెధవ సినిమాపిచ్చి నువ్వూను' అంటూ అరిచాడు మూర్తి.

'నేను మాత్రం బావుకున్నదేముంది? జమున సినిమాఅని వెడితే వాడేదో చూపించాడు. బయటబోర్డు కట్టి చూపించే దింకోసినిమా...అయినా వాళ్లననేం లాభం? నువ్విక్కడే ఆలస్యంచేశావు. దాంతో నేను బయటున్న బోర్డుమీద డేటు చూడకుండా తొందరగా వెళ్లిపోయాన్లోపలికి. వాడేదో అరవసినిమా చూపించాడు. రెండు రూపాయలు క్షవరం' అన్నాడు నరసింహం ఏడుస్తూ.

'పోనీలే, పోతేపోయింది, రెండు రూపాయలేగా...ఏడవకు' అన్నాడు మూర్తి,

'నా ఏడుపుపోయిన వాట్నిగురించి కాదు, మళ్లా నువ్వింకో రెండురూపాయి లివ్వాలి గదా అని వాటికోసం నా ఏడుపు' అన్నాడు నరసింహం

'వెధవాయ్, ముందు కాళ్లకు బంధం వెయ్యకు. అరిచి చచ్చినా యివ్వను' అని 'సరేలే ముందాలోచన ఎందుకు రేపటి సంగతి తర్వాత చూద్దాం' అన్నాడు ముందాలోచనవచ్చి.

మూర్తి లేచి టేబిలుమీదున్న గడియారం వైపు చూశాడు. ఎనిమిదయ్యింది. ప్రక్కనేవున్న వక్కపొడి పొట్లాలవంక చూశాడు. సగంపైగా ఖాళీ అయినయ్. ప్రక్కనే కూర్చుని పేపర్లో వాంటెడ్ కాలమ్సు చూస్తున్న నరసింహాన్నుద్దేశించి 'ఏరా, అగ్నిహోత్రావధాన్లూ! వక్కపొడంతా బొక్కేశావ్' అన్నాడు.

'ఏం చావను? యివ్వాళ టిఫినుకు డబ్బుల్లేవు'

'అందుకని వక్కపొడి మింగుతావ్?'

'అంత తెలివి తక్కువవాణ్ణట్రా... ఓ ఏభై పొట్లాలెత్తుకెళ్లి మన కిళ్లీకొట్టువాడికి అర్ధరూపాయి కిచ్చేసి దాంతో హోటలుకెళ్లొచ్చాను' అన్నాడు నరసింహం.

'ఓరివెధవా...సగానికి సగం దండగ చేశావుగదరా... నీకు బుద్ధెప్పుడొస్తుందిరా' కోప్పడ్డాడు మూర్తి.

'ఒరేయ్, ఆట్టే కోప్పడకు. నీకోమంచి విషయం చెప్పాలి... నీ హీరోయిన్ యింటి దగ్గర ఒక వంతెనుంది చూశావా?...ఆ వంతెన మీదనించిచూస్తే వాళ్లింట్లోవున్న హోలు కనుపిస్తుంది. హోల్లోంచి చూసినా వంతెనమీది వాళ్లు కనిపిస్తారు. కాబట్టి నువ్వు యింటిముందు తిరుగుతూ కాళ్లు నొప్పులో అని ఏడవకుండా సాయంకాలం ఆ వంతెనమీద టిప్‌టాప్‌గా నిలబడు... యిది ప్రస్తుత సలహా. తోడు కావాలంటే నేను వుంటాను' అన్నాడు నరసింహం.

'థాంక్యూ మిస్టర్ సింహం...నువ్వు నిజంగా చాణక్యుల్లాంటి వాడివిరా'

'మరి మనకి ప్రెజెంటేవిటి?... ఓరెండు రూపాయలిచ్చుకో. రాత్రి మిస్ అయిన సినిమా చూడాలి'

'సరే, ఆమిగతా వక్కపొడి పొట్లాలమ్మి డబ్బులెత్తుకో' అంటూ బ్రష్ తీసుకుని వాకిట్లోకిపోయాడు మూర్తి. మళ్లీ వెంటనే ఓ కుర్రాణ్ణి వెంటేసుకుని లోపలికొచ్చాడు.

'యితగాడెవరోయ్ గిరీశం' అన్నాడు నరసింహం.

'అదే యింకా తెలియదు...అడుగుదాం... బాబూ, నీపేరేవిటి?' అంటూ ముద్దుగా అడిగాడు మూర్తి. కుర్రాడు సిగ్గుపడ్డాడు.

'మా బాబువికదూ, చెప్పు' అన్నాడు మళ్లీ.

'రాము' అన్నాడు కుర్రాడు రెండు కళ్లూ చేతుల్తో మూసుకుంటూ.

'నేనొక టడుగుతాను చెపుతావా?' కుర్రాడిజేబులో వక్కపొడిపొట్లం పెడుతూ అడిగాడు మూర్తి. 'ఓ' అన్నాడు కుర్రాడు...

'రాత్రి మీ అక్కా, నువ్వూ గుళ్లోకెళ్లారుకదూ' అన్నాడు. కాస్సేపాలోచించి 'ఊఁ' అన్నాడు కుర్రాడు.

'ఆ అక్కపేరేవిటి?'

'దుర్గ' అంటూ ఠకీమని చెప్పాడా కుర్రాడు.

'దుర్గ'—వాట్ ఎ నైస్ నేమ్' అని వదిసార్లనుకున్నాడు మూర్తి. యింతలో 'మా అన్నయ్య' అంటూ కుర్రాడు వీధిలోకి పరుగెత్తాడు.

'నర్సూ... ఏం పేర్రా?...వెరీ నైస్' అన్నాడు హుషారుగా మూర్తి.

'ఎవర్ది ...నాపేరేనా? నేన్నిన్ననే చెప్పాగా? 'నర్సూ' అనిపిలిస్తే చాలా ముద్దుగా వుంటుందని' అన్నాడు నరసింహం.

'ఒరేయ్ ... నోరుమూసుకో బాగున్నది నీ వెధవపేరుకాదు.

'దుర్గ' పేరు చాలా నైస్‌గావుంది'

'అదా వాయవా!... 'దుర్గ' ఆవేకాదు. ఆ అమ్మాయిపేరు' [illegible] 'అమన్నా బాగానే వుంటుంది. ఊహా జబ్బు లక్షణమే అంత.'

'సింహం...యివ్వాళనుంచి మన ప్రోగ్రాం రాసుకో...అయిదు గంటలకు కాలేజీనుంచి రావటం...అయిదున్నర వరకూ డ్రెస్. అయిదున్నర దగ్గర్నుంచి కనీసం ఎనిమిదింటి దాకానయినా వంతెనమీద బీటు. యివ్వాళనుంచి ఫస్టుషోస్ కేన్సిల్. అన్నీ సెకండ్షోలే. దీన్నిబట్టి నీ ప్రోగ్రాం ఎడ్జస్టుచేసుకో' అని బ్రష్ తీసుకుని వాకిట్లోకి పోయాడు మూర్తి.

యిలా రోజూ నియమం తప్పకుండా డాబామీదకు ఆ అమ్మాయి, వంతెనమీదకు మూర్తి తప్పకుండా వచ్చేవాళ్లు. దూరాన్నుంచే ఎన్నో డ్యూయెట్లు పాడేవాళ్లు... నెలలు గడిచాయ్. డాబాప్రక్క ఖాళీలో వేసిన అరటిచెట్లూ, కొబ్బరిచెట్లూ, యితర పూలమొక్కలూ పెరిగి పెద్ద వయినయ్. వంతెనమీద నించి యింట్లో హాలు కన్పించటంలేదు ... అయినా అయిదున్నరయేసరికి అమ్మాయి డాబామీద, అంతకు ముందే వంతెనమీద మూర్తి...

చివరికోసారి విసుగెత్తి నరసింహం అన్నాడు:

'ఒరేయ్...ఎన్నాళ్లురా యీకాలక్షేపం? వంతెనమీదనుంచి పోజులు కొడ్తావ్. ఆ అమ్మాయిదగ్గరగా పోతుంటె మాట్లాడవ్. నీ వుద్దేశ్యం ఏవిటి? ... అసలా అమ్మాయిని ప్రేమిస్తున్నావా?'

'సింహం! అన్నీ తెలిసిన నువ్వే అట్లా అంటే ఎలా? 'దుర్గ'ని నేను ఎంత 'యిది'గా ప్రేమిస్తున్నాను. బూట్లుఎట్లా అరిగినయ్యో చూడు యీ వంతెనమీద తిరిగి తిరిగి'

'అయితే ఆ అమ్మాయితో మాట్లాడవేం?'

'వచ్చినచిక్కే అక్కడ కద్రా. ఎట్లా మాట్లాడేది? కాలేజీలో మాట్లాడితే ప్రక్కవాళ్లేమనుకుంటారోనని భయం. మన లొకాలిటీలో మాట్లాడ్దామంటె ఇక్కడంతా తెలుసున్నవాళ్లు. పోనీ సినిమా కెళ్లేటప్పుడు మాట్లాడ్దామంటె ఆ అమ్మ యొక్కర్తే వెళ్లదు... ప్రక్కన ఫామిలీ, సైంధవుడూ అంతా వుంటారు. ఏంచచ్చేది...క్రిందట్తడవ కనకదుర్గకొండ మీదికి దుర్గకూడా వచ్చింది. ఏం లాభం ?,

# ఆ అమ్మాయి

మళ్ళీ ప్రక్కన ఫామిలీ ఉంటా వుంది. ఏం చేసేది ?'

'అయితే ఏం చెయ్యి. అటునుంచి కాక పోతే యిటునుంచి నరుక్కురమ్మన్నారు. డైరెక్టుగా నువ్వు వాళ్ళ ఫామిలీతోనే కాంటాక్టు పెట్టుకో. నువ్వు దర్జాగా పోతూ వుండొచ్చు. ఎట్లావుంది అయిడియా అన్నాడు నరసింహం.

'అయిడియా మంచిదే, కానీ ఎట్లా వెడదాం అంటావ్?'

'చెపుతానుండు' అని నరసింహం...

'ఇలా చెయ్యి...రేప్పొద్దున గవర్నరుపేట సెంటరుకెళ్ళి ఓ పూలదండకొను. డబ్బుంటే ఓ పంచెల చాపుకూడా కొను. యింకేమైనా కొనొచ్చు నీ ఓపికకొద్దీ. అవన్నీ తీసుకుని నరాసరి వాళ్ళింటికెళ్ళు. వాళ్ళ ఫాదరు బయటే కూర్చుంటాడు ఏ పేపరో చూస్తూ. అమాంతం ఆ దండ, బట్టలు ఆయనమెళ్ళో వెయ్యి ఓ నమస్కారం పెట్టు. 'ఏవిటిదంతా?' అంటాడు. కొంచెం దిగ్గరగా కూడా అనొచ్చును. దైవం అనుకూలించకపోతే కసురుకోవచ్చు కూడా. భయపడ కూడదు. 'మీరు మా బజారుకు రావటం మా అదృష్టం అను. మీ రొచ్చాక యీ బజారు కళకళ్ళాడుతోంది అను. మీ అమ్మాయి యిక్కడ కొచ్చాక యీ బజార్లో లైట్లక్కర్లేదని బెజవాడ మున్సిపాలిటీవాళ్ళు తీర్మానించారను. ఆ చివరి ఎలక్ట్రిక్ పోల్‌కి బల్బు మాడిపోతే నువ్వు బల్బు వెయ్యమని చెపుతానికెడితే 'వెయ్యనుగాక వెయ్యం' అన్నారు మున్సిపాలిటీ వాళ్ళని చెప్పు...యిలా యింకెన్నయినా అను' అన్నాడు.

'ఒరేయ్, అనొచ్చుగానీ ... వాళ్ళొచ్చి ఆర్నెల్లు దాటింది. యిపుడేవిటీ వరా మర్శింపు?' సందేహించాడు మూర్తి.

'పోయింటే ... టెక్నికల్ డిఫికల్టీనే' ఆలోచనలో పడ్డాడు నరసింహం. మూర్తి జేబులోంచి రూపాయి తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. అయిడియా వచ్చింది.

'యీ ప్లాను సెప్టు. వాళ్ళ యిల్లు పెద్దదేగా. అందుకని యీ రోజే బయల్దేరి వెళ్ళిపో. అద్దె కొచ్చానని చెప్పు. స్టూడెంట్లని అపోహ పడొద్దను. కాండక్టు సర్టిఫికెట్లు కోల్డున్నా యిస్తానను. మీ కాలేజీలోని 'గజ్జలగుర్రం' నిన్ను 'అమ్మాయికా' అని రోజూ నందపర్లు పిలుస్తుందని చెప్పు. యిలానే బిరుదులు చాలామంది ఆడపిల్లలు యిచ్చారనచెప్పు...'

'నీ బొంద...మొదట్లోదు అప్పుడే నుంచి దాలోచన. వాళ్ళింటికి 'టులెట్' బోర్డు లేదు. అది తెల్సుకుని మాట్లాడు'.

'యింత లోకజ్ఞానం లేదేరా నీకు. ఖాళీ వున్న ప్రతి యింటిముందు 'టులెట్' బోర్డు వుంటోందా ? ఖాళీ వుందో లేదో కనుక్కోవటం రూం కావల్సిన మన కర్తవ్యం.'

'మేం బోర్డు కట్టలేదు. నువ్వెందుకొచ్చావ్' అంటె ముసలాయన?' 'సందేహం వెలిబుచ్చాడు మూర్తి.'

'ప్రతిదానికీ యిలా ఆలోచిస్తే లాభం లేదు. అక్కడ బోర్డు లేకపోవటమే కాదు; వాళ్ళకి అద్దెకివ్వాలన్న అయిడియా లేకపోయినా నువ్వు పుట్టించాలి. నువ్విచ్చే మున్నూరు రూపాయలు ఎందుకైనా పనికొస్తాయని చెప్పు. మా స్నేహితుడికి...అంటె నాకు... దీర్ఘ వాయిదాలమీద అప్పివ్వటానికైనా పనికొస్తుందన్చెప్పు...

'పోరా, బోర్డులేందే ఎలాగయినా వెళ్ళటం కష్టం. బాగుండదు'.

'అయితే ఓపన్చెయ్యి. ఇవాళే 'టులెట్' అని ఓ బోర్డు రాయి. అర్ధరాత్రి వాళ్ళ గేటుకి కట్టి, రేప్పొద్దున 'అద్దెకొచ్చా' నంటూ వెళ్ళు.'

'నీ వన్నీ వెధవ సలహాలే. అర్ధరాత్రి అది కట్టుంటె 'దొంగ' అని పట్టుకుంటే రేప్పొద్దున తలెత్తుకు తిరగాలా?'

'అన్నిటికీ అడ్డంకులు చెపితే నీవని జరిగినట్లే... యింతమాత్రం ధైర్యంలేని వెధవ్వి ప్రేమించటం ఎందుకూ?' ఎత్తిపొడిచాడు నరసింహం.

'సింహం, ఈ సలహా యివ్వటానికేనా నా జేబులోంచి నాలుగు రూపాయలు తీసుకుని నీ జేబులో వేసుకున్నావ్?'

'ఒరేయ్ మూర్తి! నాకే అయిడియానే వచ్చింది. నువ్వు రేపే వెళ్ళి 'రూం' కావాలను...ఓ రూపాయి యిటివ్వు చెపుతాను'.

'యిందాకట్నుంచి తీసుకున్నవి చాలవా?'

'అవి రూపాయి కాగితాలోయ్. ఇప్పుడు

రూపాయిబిళ్ళ కావాలి. టాస్ వేద్దాం. రూపాయి వెళ్ళమంటె వెడుదువుగాని...లేక పోతే లేదు'... టాస్ వేశాడు. రూపాయి వెళ్ళొద్దంది. నరసింహం కొంచెం విచారించి రూపాయిబిళ్ళ జేబులో వేసుకుని బోల్డు సంతోషించాడు. వెళ్ళటం తప్పినందుకు సంతోషించి, రూపాయి నరసింహం దగ్గరికి వెళ్ళిపోయినందుకు కొంచెం విచారించాడు మూర్తి ... రూపాయిబిళ్ళ జేబులో పడంగానే నరసింహానికింకో అయిడియా వచ్చింది.

'మూర్తీ...అయిడియా ... మన ఎసోసియేషన్‌కు మెంబర్లు కావద్దూ ... మనం రేపు స్థాపిద్దామనుకుంటున్న... స్థాపించాలని యిప్పుడే అయిడియా వచ్చిందిలే. అయినా ఎప్పటినుంచో అనుకుంటున్నట్టు లెక్క...బజారుకి పద అంతా చెపుతాను' అంటూ మూర్తిని బజారుకి లాక్కెళ్ళాడు నరసింహం.

* * *

ప్రొద్దున ఎనిమిది గంటలయ్యింది ...

మూర్తి, నరసింహం ఆ యింటిముందు అటూ యిటూ తిరిగారు. గేటుదాకా వచ్చే వరకూ ఓ. కె. అన్న 'మైండు' గేటు ముందుకు రాగానే 'స్టాప్' అవటంతో మూర్తి త్వరగా యిల్లుదాటి వెళ్ళిపోయేవాడు. నరసింహం కూడా కోపంగా వెంట వెళ్ళేవాడు. నాలుగు సార్లిలా అయిన తర్వాత నరసింహం కసురుకున్నాడు:

'వరేయ్, ఫూల్, యింకో మాటిల్లా పారిపోయావంటే యిహన్నివెంట రాను తెలుసా' అన్నాడు.

'ఏం చెయ్యనురా ... కాళ్ళు వణుకుతున్నయ్. తీరా అందాకా వెడితే మాటొస్తుందో రాదో.'

'నీ బొంద...పద యీమాటు'...లాక్కెడుతున్నాడు నరసింహం.

'ఒరేయ్, కాస్సేపాగు. గొంతారిపోతూంది.కాస్త సోడా తాగుదాం' అన్నాడు మూర్తి ... యిద్దరూ ప్రక్కనే వున్న కిళ్ళీషాపులో సోడా తాగారు ... మూర్తి బుజాలమీద చెయ్యివేసినట్లు వేసి చొక్కా గట్టిగా పట్టుకుని ముందుకు లోనుకు పోయాడు నరసింహం. గేటుదాటి వరండాలోకి వెళ్ళారు... వరండాలో మునలాయన పేపర్లో తల దూర్చి కూర్చున్నాడు.

## ఆ అమ్మాయి

యిద్దరూ ఓ నిమిషంసేపు నిలబడ్డారు. ముసలాయన తల పైకెత్తలేదు. తమ ఉనికిని తెలియచేసేందుకు గాను దగ్గాడు నరసింహం. అయినా ఆయనలో చలనం లేదు. నిద్రగాని పోవటం లేదుగదా అని అనుమానపడ్డారు...కాస్సేపాగి 'గుడ్‌మార్నింగ్ సర్' అన్నాడు గట్టిగా. ముసలాయన వీళ్ల వంక కాస్సేపుచూసి 'ఆగ'మని చేత్తో సంజ్ఞచేసి మళ్లీ పేపర్లో మునిగిపోయాడు.'

'యిదేవిటిరా' అనుకున్నారిద్దరూ... కొంతసేపటికి ముసలాయన పేపరు మడిచాడు. కళ్లజోడుకూడా తీసి ముడిచాడు. వీళ్లిద్దరివంకా 'మీ రెవరన్నట్లు' చూశాడు. నరసింహం మొదలెట్టాడు.

'సార్, నాపేరు నరసింహం. నిన్ననే ఓ యింటర్వ్యూ కెళ్లాను. రేపో వుద్యోగం రావచ్చు. రాకపోయినా ఎల్లుండింకో యింటర్వ్యూ వచ్చేస్తుంది లెండి. యిహ పోతే వీడు మా ఫ్రెండు మూర్తి; బి. కాం. చదువుతున్నాడు...'

స్టోరీలో నరసింహం హీరో అయిపోతాడేమోనని మూర్తి భయపడ్డాడు. వెంటనే నేనూ వున్నా అన్నట్లు—

'మీ సహాయం కావల్సివచ్చాం' అన్నాడు మూర్తి. ఆయన కాస్సేపు వీళ్లవంక చూశాడు...కాస్సేపాగి—

'ఎక్స్యూజ్ మీ, యిపుడు మీకేం సహాయం చెయ్యలేను. ఫస్టు తర్వాత కన్పించండి' అన్నాడు. మూర్తికి అవమానం వేసింది. నరసింహం నవ్వుకున్నాడు. నరసింహం యిలాంటివాటికి అవమానింపబడ్డట్లు 'ఫీల'వ్వటం ఎపుడోనే మానేశాడు. నవ్వుకుని మళ్లీ అందుకున్నాడు.

'మేం చెప్పేది సరిగా అర్థం చేసుకోండి...మేం డబ్బుకోసం రాలేదు. అసలు మాకు డబ్బుతో పన్లేదు. మా మూర్తికి డబ్బు యిబ్బందంటె ఏవిటో తెలియదు. వాడున్నంతవరకూ నాకూ ఏం బెంగలేదు... నేను పంపే అప్లికేషన్ల డబ్బు దగ్గర్నుంచి, యింటర్వ్యూ ఖర్చులదాకా మా మూర్తే పెడ్తాడండీ...మా మూర్తి ఎంత గొప్పవాడంటె— 'ఒరేయ్ సింహం! ఈ అప్లికేషను రిజిష్టర్డు పోస్టులోనే పంపురా' అంటూ అర్థంలేని ఉద్యోగాలకి కూడా అంతడబ్బు ఖర్చుపెడ్తాడండి...కాని యిప్పుడు మేం ఎందుకొచ్చామంటే — 'జెంటిల్‌మెన్ రిక్రియేషన్ ఎసోసియేషన్' అని మేమొక ఎసోసియేషన్ స్థాపించాం. దాంట్లో మీరు మెంబర్‌షిప్ తీసుకుంటారేమోనని అడగటాని కొచ్చాం.'

'మీ ఎసోసియేషన్ ఆశయాలేవిటి... ఆసియాలో యిలాంటి ఎసోసియేషన్లు రోజుకొకటి బయల్దేర్తున్నయ్!' అన్నాడు ముసలాయన. మూర్తి దగ్గాడు. గొంతు సవరించుకుని మొదలెటాడు. సమాధానం ఆలోచించి, 'రిపోర్ప్లు' వేయించిందే అయినా ఎక్కడేం తగలెడ్తాడోనని అగ్నిమాపకదళంలా కాచుక్కూర్చున్నాడు నరసింహం.

'ఈ రోజుల్లో చూశారూ! మనిషి ఫిజికల్‌గా పెరగలేకపోతున్నాడు. 'మోరల్'గా పెరుగుతున్నాడా అన్నదటుల్లా అవతల వుంచండి. ఇహ ఈ యువతల్నుంచి చూస్తే ఈ రేడియో యాక్టివిటీ, ఈ రేషను బియ్యం...వీటన్నిటితో ఏం పెరుగుతాడు చెప్పండి. అందుకని మా ఎసోసియేషన్ ఈ లొకాలిటీలోవున్న వాళ్లందరికీ ఆటలు — అంటె వాలీబాల్, ఫుట్‌బాల్, క్రికెట్...యివన్నీ ఏర్పాటుచేస్తుంది. మీలాంటి పెద్దవారికి చెస్‌గానీ, కేరమ్సు గానీ ఏర్పాటుచేస్తాం...'

'వాడ్యా యూ మీన్?' అంటూ కుర్చీలోంచి అమాంతం లేచాడు ముసలాయన. 'నేను ఫస్టుక్లాసు క్రికెట్ ప్లేయర్ని. నా చిన్నతనంలో ప్రెసిడెన్సీ ఫస్టు. ఇప్పటికీ ఆశక్తి కొద్దిగా కూడా తగ్గలేదు. కాకపోతే ఆసక్తి తగ్గింది...అంతే.'

మూర్తి 'నీవేతప్ప...' అనే పోజులో నరసింహంవంక చూశాడు. ముసలాయన యిలాంటి 'కథాకళి' చేస్తాడని యిద్దర్లో ఎవ్వరూ వూహించలేదు. నరసింహం మొదలెట్టాడు.

(ముగింపు పైవారం)

# అవిశ్వాసానికి తగిన శాస్తి




బులుసు వేంకటరమణయ్య

దేవుడిమీద నమ్మకం లేకుండా, వేదాల పైని ప్రామాణ్య బుద్ధి లేకుండా ఉండే నాస్తికులు కష్టాలు పొందుతారు. మొండి పట్టుతో దైవాన్ని తిరస్కరిస్తే వారికి తగినశాస్తి అయితీరుతుంది. దేవునిపై నమ్మకం వుండాలి. ఎంత మాత్రమూ అవిశ్వాసం వుండకూడదు.

ఒకవూళ్లో ఒకయువకు డుండేవాడు! అతడు పరమ నాస్తికుడు, ఈ ప్రపంచమే నిత్యమనీ; మానవుడికి అతీతమైన కార్యం లేదని అతని భావన. అతడు ఒకప్పుడు పెళ్లి చేసుకోవాలని ఒక సంబంధం నిశ్చయించుకున్నాడు. వివాహం చాలా సామాన్యంగా జరగాలనీ తానుమట్టుకు కన్యాగృహానికి వెళ్లి కార్యం అయిందని అనిపించుకుందామనీ అతని సంకల్పం. అతని స్నేహితుడొకడు 'ఏ కార్యానికయినా ముందు గణపతిని పూజించాలి' లేకపోతే ఆయన విఘ్నం కలిగిస్తాడు. వినాయకుణ్ణి పూజించి మరీ బయలుదేరు' అన్నాడు. 'పోదూ, నాపెళ్లికీ, వినాయకుడికీ సంబంధంయేమిటి? నేను ఏ దేవుణ్ణీ పూజించను. ఎలా ఆటంకం కలుగుతుందో చూస్తాను' అన్నాడు. వివాహదినంనాడు కొంచెం చీకటి వుండగానే కన్యాగృహానికి బయలుదేర దలచాడు. నాడు వీధిద్వారం తలుపు తెరిచి అడుగు వెయ్యగానే, పాదం అక్కడ పడివున్న అపుపేడమీదపడిన అతడు జారిపడ్డాడు. కాలువిరిగి కదలలేక పోయాడు. కాలు బాగుకావడానికి కొన్నినెలలు పట్టింది. ఈవిధంగా ఆ సంబంధం తప్పిపోయింది.

కొన్నాళ్లకు మరో సంబంధం నిశ్చయించుకున్నాడు. ఉదయాన కాకుండా మధ్యాహ్నం కన్యాగృహానికి వెళ్ల నిశ్చయించాడు. వెనకటి మిత్రుడు మళ్లీ వచ్చి 'నా మాట వినక, కాలు విరగగొట్టుకొన్నావు అప్పుడు. ఇప్పుడేనా అట్టి ప్రమాదమేమీ కలగకుండా ముందుగా గణపతిపూజ చెయ్యి.' అన్నాడు. ఆ నాస్తికుడు అతనిమాట వినలేదు. అతడు వివాహానికి వెళ్తూ వుండగా దారిలో ఉన్న ఒక తోరణద్వారంమీది పెద్ద దారుప్రతిమ అతని కుడిభుజంమీద పడిపోయి, చేతికి గట్టిదెబ్బ తగిలింది. తన్ను లెక్క చెయ్యకుండా మొండికెత్తిన ఆ పెళ్లికొడుక్కి యీ విధంగాకూడా గణపతి తన శక్తిని చూపించాడు. దానితో, ఆ వివాహం తప్పిపోయింది.

కొన్ని నెలలకు, ఆ నాసికుని చెయ్యి సరిపడింది. ఈ సారి ఎలాగయినా వివాహం జరిగితీ రాలని అతనికి పట్టుదల కలిగింది. ఒక సంబంధం నిశ్చయించుకున్నాడు. ఈ సారి ఆ వూరిలో కాకుండా పొరుగూరిలో పెండ్లి చేసుకోదలచాడు. అతని మిత్రుడు మళ్లీ వెనకటి పాటే పాడినాడు. నాస్తికుడికి కోపం వచ్చింది. గణపతికీ, ప్రతిమ పడడానికి సంబంధంలేదనీ, అది పురాతన ద్వారం కావడంవల్ల ప్రతిమ పడిపోయి వుంటుందనీ చెప్పి, ఇక ఆ ప్రసంగం తేవద్దన్నాడు. గణపతికీ కోపం వచ్చి, యీ సారి తగినశాస్తి చెయ్యాలని నిశ్చయించు కున్నాడు.

నాస్తికుడు పొరుగూరికి బయలుదేరాడు. దారిలోనే చిన్న చినుకులు ప్రారంభమయాయి. మార్గమధ్యం చిన్న యేటిని దాటవలసి వచ్చింది. అప్పటికే వాన పెద్దదయి, ఏటిలో దిగేసరికి పెద్ద ప్రవాహం వచ్చింది. ఆ ప్రవాహంలో అతడు కొట్టుకొని పోయాడు.

విఘ్న నాయకుడైన గణాధిపతిని తిరస్కరించడంవల్ల భగవంతుని యందు నమ్మకం లేని ఆ యువకుడు వివాహానికి బయలుదేరి అసువులు కోల్పోవలసి వచ్చింది. మనిషికి ఆత్మవిశ్వాసం వుండాలి, కాని అతి విశ్వాసం కూడదు. తనకు పైని అదృశ్యంగా భగవచ్ఛక్తి ఒకటి ఉన్నదని తెలుసుకోవాలి. అలా లేనప్పుడు దాని ఫలితాన్ని తప్పక అనుభవించవలసి వస్తుంది. ●






### జరిగిన కథ

లలితకి మోహన్‌తో పరిచయమవుతుంది. అది ప్రేమగా పరిణమిస్తుంది. పెళ్ళికూడా చేసుకోవాలనుకుంటారు. ఆస్తికోసమే మోహన్ తనని పెళ్ళిచేసుకోదలిచాడని తెలుసుకున్న లలిత అతనితో తెగతెంపులు చేసుకుంటుంది. లలితకి పెద్ద దిక్కయిన అత్తయ్య చనిపోతుంది. లాయరు సలహాన ఆమె బలరామశాస్త్రిగారనే మాజీ గార్డియన్ ఇంటికి వెళ్తుంది. అక్కడ అతని మేనత్త సరస్వతమ్మ, కూతురు సరళ వుంటారు.

## 4

హాలులోకి వస్తూ వారి మాటలు వినకపోయినా తనకెంత ఇక్కడ ఉండడం యిష్టం లేదో సరస్వతమ్మకి అంతగానూ అయిష్టంగానే ఉందని గ్రహించే ఉండును లలిత.

బలరామశాస్త్రి ఒక్కమాటలో కూడా కలుగచేసికోలేదు. సరికదా కుతూహలం కూడా కనపర్చడంలేదు. ఎలాగో కాఫీ ముగించి లేచి నిలబడ్డాడు.

'నాకు కొంచెం పనుంది మళ్ళీ సాయంత్రం దాకా రాను. ప్లీజ్, ఇది మీ ఇల్లే అనుకుని స్వేచ్ఛగా ఉండండి' అని లలితకి చెప్పి—తన గదిలోకి వెళ్ళబోయాడు. లలిత ఆత్రంగా 'బలరామశాస్త్రిగారూ' అంటూ పిల్చింది. ఆ పిలుపుకి అటు బలరామశాస్త్రి అదిరిపడి నిలిచాడు. ఇటు సరళా గబగబ నవ్వేసింది.

సిగ్గుతో ముఖం కందగడ్డలాగా అయింది లలితకి.

'ఏమిటి లలితగారూ?' అన్నాడు అతి వినయంగా.

'నా పుస్తకాల పెట్టెలు, అవీ వస్తాయి. వాటిని స్టేషను నుంచి తెచ్చుకోవాలి' నసిగింది.

'నేనా సంగతి చూస్తాను. మరేం ఫరవా లేదు. అంతేనా?'

'అంతేనండీ' అంది తేలికగా.

'నువ్వేం పనిమీద వెడుతున్నావో నాకు తెలుసులే బలరాం. నీ ప్రియబాంధవి దగ్గరకేగా' కొంటెగా అడిగింది సరళ.

'అవును సరళా. ఏం? వెళ్ళకూడదా?'

'నీదంతా మరీ విచిత్రం, ఇంతమంది కుర్రాళ్ళం ఉంటే ఆ ముసలావిడ చుట్టూ తిరుగుతావు'.

'నాకావిడ ఎంత ఇష్టమో తెలుసుగా? పది నిముషాలు నీలాంటి దానితో గడిపితే—ఏం మాట్లాడ్డానికుండదు. అదే డెబ్బయి ఏళ్ళు వచ్చిన అవ్వగారు హాయిగా కబుర్లు చెప్తారు. తెలుసా?' నవ్వుతూ లలిత కేసి తిరిగాడు.

'చూడండి, మనం ఈ ఇంట్లో మసలక తప్పదు. అలాటప్పుడు అందరిలాగా మీరూ నన్ను బలరాం అని పిలవాలి. సరేనా? మీ కంటే పెద్దవాణ్ణే కనుక లలితా అని పిలుస్తాను,' అని సమాధానం వినకుండానే తన గదిలోకి గబగబ వెళ్ళిపోయాడు బలరాం. ఆ క్షణంలో లలిత మనస్సు అల్లకల్లోలంగా ఉంది. ఇక్కడికి రాకుండానే ఉండిపోతే ఏం జరిగేది? అక్కడ ఎలాగో గడిచిపోయేది కదా?...తిరిగి మోహన్ తారసపడేవాడేమో. నిజంగా ఇలా జరుగుతుందని తెలిస్తే మోహన్‌ని పెళ్ళాడేసి ఉండొచ్చుకదా? నిజంగా సంరక్షకుడైతే ఈయన ఆ పెళ్ళికి ఒప్పుకుని ఉంటాడో లేదో?...ఇప్పుడీ సరస్వతమ్మ వాకో పెళ్ళికొడుకుని చూపి వదుల్చుకుంటుంది కాబోలు...

'అలసిపోయావు కాబోలు రెస్టు తీసుకుంటావా? లేకుంటే అలా తోటలో తిరిగి వద్దామా?' సరళ అడిగింది—

'నాకు ఆలోచించుకోవలసిన పనుంది. ఏమీ అనుకోకు' అంటూ మేడమెట్ల వైపు దారి తీసింది లలిత.

గదిలో ఓ మూలగా కూర్చుని తమలపాకులు వేసుకుంటున్న రత్తి అలికిడి విని బొడ్డు సంచీలో తమలపాకులు దాచేసి కూర్చుంది. లలితని చూస్తూనే, 'రండి అమ్మాయిగారూ ఆళ్ళని చూశారా?' అంది కుతూహలం అణచుకోలేక. వస్తూనే మంచం మీద వాలిపోయింది లలిత. మనస్సు చాలా బాధగా ఉంది. ఎందుకొచ్చానిక్కడికి అని పదే పదే అనిపిస్తోంది. దానికేదైనా ఉపాయం చూడాలని ఆలోచనలు చేస్తోంది.

'ఆళ్ళు ఎప్పుడూ అంతేనమ్మా. బాబుగారికి తెలిసినవాళ్ళు వస్తే చాలు ఊం ఇదై పోతారు.'

'ఆవిడ నిజంగా మేనత్తేనా ఆయనకి?' సర్దుకు పడుకుంటూ అడిగింది లలిత.

లేచివచ్చి మంచం దగ్గర కూర్చుంది రత్తి.

'కాదమ్మాయిగారూ, దూరపు చుట్టం. మొగుడు పోయాడట. ఎవరూ లేరు— ఈ పిల్లది తప్పించి, ఇక్కడ చేరింది. ఎలాగైనా బాబుగారికా పిల్లని కట్టిపెట్టాలని...ఆ పిల్లది గడుగ్గాయి అమ్మాయిగారూ, ఏంటా వేషాలవీ, పోకులవీ, ఏం పోకళ్ళు పోతదనీ ... ఈ చుట్టుపక్కల గొప్పంటి పిల్లకాయిలంతా స్నేహితం. ఎక్కడో అక్కడికి కారేసుకు పోతూంటుంది. ఒక్కోరోజైతే అంతా ఇంటో జేరి అదరకొడతారనుకో — బాబు పట్టించు

కోడు...'

'నేనలా సరదాగా ఉండలేనని వాళ్ల ఉద్దేశ్యం. పోనీలే రత్తి, మీ బాబుగారెక్కడికేనా వెడితే చీకటి పడేదాకా రారా?'

'వస్తారమ్మ, అయ్యగారి కావలసినావిడొకతె ఉందీ చుట్టు పక్కలే— అక్కడికే వెడతారు. రోజూ—అయిదయేసరికి తోటలో వుంటారు—గులాబులు ప్రత్యేకంగా పెంచుతారాయన. ఓమూలగా చిన్న తోట వేశారు అక్కడే ఉంటారు సాయంత్రం ఏం?'' అడిగింది రత్తి.

'ఏం లేదు. కొంచెం మాట్లాడాలి. అందుకనీ,'

'సాయంత్రం నేనుండి తోట చూపిస్తానుగా, నేకిందకి పోనా యిక్కడే ఉండనా?'

'పో నాకేం పనిలేదిప్పుడు. ఏదేనా పుస్తకం తీసి చూసుకుంటాను.' అంది లలిత.

రత్తి లేచి కిందకి వెళ్లిపోయింది.

అర్థం లేని అర్థం కాని ఊహలతో సతమతమవుతూ పడుకుంది లలిత. సాయంత్రం బలరామశాస్త్రిని కలుసుకుని ...తనేమనుకుంటున్నదీ చెప్పాలి అనుకుంది ... బలరాం... రూపానికి తగ్గ పేరే. మంకుతనం కూడా బాగా ఉన్నట్టు ఉంది—అనుకుంది.

భోజనాల సమయంలో బలరాం లేదు ఎవరికివారే తినడం కానిచ్చారు. సాయంత్రం దాకా తన గది వదిలి బయటికి రాలేదు లలిత నీరెండ నీడలు వాలుగా గదిలో పడుకున్నాయి. లేచి ముఖం కడిగి తల దువ్వుకుంది. చీర సరిచేసుకుంది. కిందికి దిగగానే, కాఫీతో వంటావిడ ఎదురైంది — 'నీకే తెస్తున్నానమ్మాయి, ఇంద' అంటూ అందించింది. అటూ ఇటూ తిరుగుతూ కాఫీ ముగించి కాఫీ కప్పు బల్లమీద పెట్టి తోటలోకి దిగాలని వరండా వెనక వైపుకి నడిచింది. తీరా చూస్తే అటు మెట్లు లేవు. వరండా పిట్టగోడ ఎత్తూ లేదు ... అటు ఇటు చూసింది లలిత. ఎవరూ చుట్టుపక్కల లేరు. నిశ్చింతగా గోడమీద కాలువేసి నెమ్మదిగా అటు వైపుకి దూకింది...అప్పుడే అటు తిరగబోతున్న బలరాం తలెత్తి చూశాడు. తను చేసిన పనికి సిగ్గుపడింది లలిత. 'అయితే



మిమ్మల్ని ఓ కంట జాగ్రత్తగా కనిపెట్టు అన్నమాట.' అన్నాడు నవ్వుతూ.

'ఇటు మెట్లులేవని తెలియదు— గోడ ఎత్తులేదు కదా ?' అంటూ తేలికగా నవ్వేసింది లలిత.

'తోట చూస్తారా ? రండి, దీనిలో నా భాగం ఓటుంది ప్రత్యేకంగా' అంటూ దారితీశాడు బలరాం.

అన్నీ గులాబి చెట్లే. వరసలుగా నాటి ఉన్నాయి. కొన్ని మరీ చిన్నవి. కొన్నిటికి ఆకులె లేవు. కొన్నిమటుకు మొగ్గ తొడిగాయి కొన్నిటికి ఒకటే అరాపూత ఉంది.

నా కిది హాబీ, సరదాగా రకరకాలు పెంచుతాను. రోజ్ పెంచడం కష్టం. మీకు తెలుసా ?'

'పట్నాల్లో మేడమీద వాటాలో ఉండే మాలాంటి వాళ్ళం క్రర తొట్లెల్లోనూ, పూల కుండీలలోనూ తప్పించి మొక్కలని చూడండి శాస్త్రిగారూ' అంది లలిత.

'అదిగో మళ్ళీ. బలరాం అవి పిలవ మన్నానుగా?'

'నా కింకా అలవాటు కాలేదు...' అతని ముఖంలోకి చూస్తూ ఊరుకుంది లలిత. అతనూ తననే పరీక్షగా చూడడం గమనించింది. 'ఈ సన్నగా నాజూకుగా పొడుగ్గా ఉన్న అమ్మాయికీ ఆ రెండుజడల పిల్లకీ పోలికలే లేవు. ఉంగరాలు తిరిగి ముఖం మీద పడుతున్న ఆ జొత్తేనా—ఎంతో సుదీర్ఘ

# ప్రేమించు ప్రేమకై

మైన వాలుజడ ?' ఆ బొమ్మే ఉండి పోయిందేం నా మనస్సులో ? — పాపం తనకీ ఇబ్బందిగానే ఉన్నట్టుంది—ఎలాగా ? చిన్నపిల్ల ! అందుకే మాటలకి సహితం తడుముకుంటుంది, అనుకున్నాడు. ఎందు కొచ్చిన బెడద ! ... 'రామచంద్రరావు ఏం పని చేశాడు భగవంతుడా, సుఖంగా ఉన్న ప్రాణాన్ని కష్టపెట్టుకోడానికి కాకుంటే ఈ బాధ్యత తానెలా స్వీకరించాడు ?' తన ఆలోచనలలో పడి కన్నార్పక లలితకేసే చూస్తున్న సంగతి గమనించనే లేదు బలరాం.

'బలరాంగారూ' ఒణుకుతున్న కంఠంతో అంది లలిత. 'మీతో మాట్లాడాలని అనుకున్నాను. ఈ సదవకాశం జారితే మళ్ళీ ఏకాంతంగా మీరు దొరక్కపోవచ్చు. నేను వాళ్ళందరిముందూ ధైర్యంగా మాట్లాడలేకనూ పోవచ్చు' బలరాం బదులుగా తలూచాడు.

'నా బెడద అనవసరంగా వచ్చిపడింది మీకు. నిజానికిలా జరగనే అక్కరలేదు. అంతా అత్తయ్య చాదస్తం. లాయరుగారి మంకుపట్టూను ... నే నిక్కడే ఉండాలని లేదుగా'

ఆతృతలో మాటలు వడివడిగా వచ్చేస్తున్నాయి.

బలరాం కళ్ళు వింతగా మెరిశాయి.

'అలాగా ? పోనీ దీనికింకో దారేమైనా ఉందేమో ఆలోచించారా ?'

బదులు తోచక ఓ క్షణం తటపటాయించింది—ఆ సూటి ప్రశ్నకి. మాటలకి కరువైనట్టు గొంతుక పొడారిపోయింది. కష్టంమీద కూడదీసుకుని అంది—

'నే నింకా అదేం ఆలోచించలేదు గాని ...' ఆగింది.

'పోనీ ఈ ఇల్లంటే ఎందుకంత అయిష్టం కల్గిందో—అదేనా చెప్తారా?'

'అదేం లేదండీ, ఇంత అందమైన ఇల్లు నే నెక్కడా చూడలేదు. ఇది చూడగానే నాలో కొత్త ప్రపంచంలోకి అడుగెట్టా ననిపించింది...కాని...' మాటలు రాలేదు సరికదా కళ్ళు నీళ్ళతో నిండాయి లలితకి. పెదవులు బిగపట్టి దుఃఖాన్ని ఆపుకొంది. కాని నిండిన కన్నీరు చెంపల మీద నుంచి కారసాగింది. చిన్న పిల్లలాగా చేతితో చెంపలు తుడిచేసుకుంటున్న లలితని ఆదరంగా చూశాడు బలరాం.

'మరెందు కలా వెళ్ళిపోవాలని కోరుకున్నారో నా కర్థం కావడం లేదు.'

'మామయ్య నే నిక్కడే ఉండాలని ఎందుకోరాడో అర్థం కావడం లేదు. ఎప్పటికీ ఇక్కడే ఉండాలా ? అయినా ఎందుకు నేను అందరికీ భారంగా బ్రతకాలి ?

మావూళ్ళో నేను హాయిగా బ్రతకలను. లాయరుగారు కూడా ఒక ట్రస్టీయేకదా ? ఆయన అక్కడే ఉన్నారు. నాకు సాయం కావలిస్తే అత్తయ్యకి తెలిసినావిడ అవ్వగారున్నారు. ఆవిడకీ ఎవరూ లేరు. నాదగ్గరే పెట్టుకుంటాను...ఒకలా స్థిరపడేదాకా ఉద్యోగం చేసుకోకలను...' అతనేమనుకుంటున్నాడో ? అన్నట్టు బలరాం ముఖంలోకి చూసింది. అతనికళ్ళు చిలిపిగా మెరుస్తున్నాయి. దయా ? జాలా? ఏమిటి అతని చూపులో ఉన్నది ? అర్థం కాలేదు లలితకి. చిన్నపిల్ల నేరాలు చెప్తుంటే వింటున్నట్టుందేమో అతనికి — కోపం వచ్చింది లలితకి.

'నువ్వు చెప్పేది బాగానే ఉందనుకో. అయినా, ఒక్కమాట. నేను నీ బాధ్యత కోరి బుజాని కెత్తుకున్నానంటే నమ్ముతావా లలితా ?'



ఆహా !




ప్యారీస్
మిఠాయిలు
వాటి రుచే
రుచి !





'అతని కంఠంలో ధ్వనించిన ఆప్యాయతకి ఎక్కడలేని దుఃఖం పొంగి వచ్చింది లలితకి. ఈ మనిషి తనగురించేగాని ఇతరుల గురించి అర్థం చేసుకోడేం. తన కిష్టమైతే సరళకి సరస్వతమ్మకీ ఇష్టం లేదని ఎలా చెప్తుంది తను ?

'కాని...' ఏదో చెప్పబోయింది.

'ఇది విను. నువ్వు నాదగ్గర చాలా చిన్న పిల్లవి. నిన్ను మీరనడం నాకే బాగు లేదు' ఏం అనుకోకు.

నేను మామయ్యని రెండేళ్ళక్రితం ఆఖరుసారి చూశాను. 'బాగా చిక్కి వడిపోయాడు. నువ్వంటే ఎక్కడలేని అభిమానం. నీకోసం వచ్చాడటగాని చూడనివ్వలేదని బాధపడ్డాడు. తన డబ్బు నీకే రావాలని అనుకోలేకగా చెప్పాడు కూడా. అంతేకాదు. మీ మేనత్త నీకని ఏమిస్తుందో ఊహించలేక పోయాడు. అతనికి తొలి దగ్గరనుంచి ఆవిడ ధోరణి కిట్టదు. నిన్ను స్వేచ్ఛగా పెంచాలని, తనకూడా తిప్పుకోవాలని ఎన్నో కలలు కన్నాడు. ఆవేం కుదరనివ్వలేదు—సుబ్బమ్మగారు. నిన్ను పెంచుకోవాలని ఎంతో ప్రయత్నం చేశాడు. అదీ సాగనివ్వలేదావిడ. మీ మామయ్యని గురించి నీకేం తెలుసు లలితా ? నన్నడుగు చెప్తాను.' అన్నాడు బలరాం.

'నాకు తెలిసిందంతా ఒకటే. మామయ్య వస్తే చాల సరదాగాఉండేది. అస్తమానమూ నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడు. నేనింకా అప్పుడు ఫస్టియరు కాలేజి చదువుతున్నాను. మళ్ళీ చూడనే లేదు. అప్పుడు కూడా అత్తయ్య నన్ను మామయ్యతో బజారుకి కూడా వెళ్ళనివ్వలేదు. అదే బాగా జ్ఞాపకం నాకు...మామయ్య వెళ్ళిపోతూ, చాలా బెంగపడ్డట్టు కన్పించాడు, నిజమే. అంత ఉత్సాహం కల మనిషికి అత్తయ్య నచ్చేదురే...'

'మీ మామయ్య రామచంద్రం నేను కలిసి చదువుతున్నాం లలితా, వయస్సులో నా కంటె రెండేళ్ళు పెద్ద అంతే అన్నాడు బలరాం...

'అవునా ? [illegible]... మీరింతా...'

'చాలా చిన్నవాళ్ళ మనుకున్నావా?' నవ్వేశాడు బలరాం.

'మా మామయ్యమటుకేం [illegible] ఇంట.' అంది లలిత.

# ప్రేమించు ప్రేమకై

'ఇరవై కి ముప్పయి అయిదుకీ బోలెడు తేడా కన్పించడంలో అసంబద్ధం ఏముంది? నీకంటికి నేనో ముసలివాణ్ణి. సరళ చూడు ఏమంటుందో!'

'నా ఉద్దేశ్యం అది కాదండీ...' ఏమనాలో తెలియక ఊరుకుంది లలిత.

'రామచంద్రం కాలేజీలోకూడా చాలా చెలాకీగా ఉండేవాడు. తరవాత కొన్నాళ్ళపాటు కనబడలేదు. నేను పైచదువులకి విదేశాలు వెళ్ళిపోయాను...నే తిరిగివచ్చిన రెండు మూడేళ్ళకి తారసపడ్డాడు. ఓ రోజంతా నాతో ఇక్కడ గడిపాడు. ప్రేమించి పెళ్ళాడానని చెప్పాడు. ఇల్లు వదలి వచ్చానని చెప్పాడు. ఏదో వ్యాపారం చేస్తున్నాను బాగానే సాగుతోందని చెప్పాడు. కాలం జరిగిపోతూంది. అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూండేవాడు—విశేషాలతో. ఆ విశేషాలలో నువ్వు ప్రత్యక్షంగా కన్పిస్తూండే దానివి. అప్పుడే గ్రహించాను నువ్వంటే అతనికి ఆరోప్రాణం అని...

నిశ్శబ్దంగా కూర్చుని కంటనీరు కారుస్తూంది లలిత. తననిలా ఆరోప్రాణంగా ఎంచిన మామయ్యని తన దృష్టిలో ఓ మృగంలాగా చిత్రించి పెంచింది అత్తయ్య అని.

'ఐదారేళ్ళ కిందట ననుకుంటాను ఇక్కడికి వచ్చాడు. అప్పుడే ఇచ్చాడా ఫోటో—నీది.'

'నన్నలా తిప్పి తీసుకొస్తానని తీసుకెళ్ళి తీయించాడా ఫోటో — అత్తయ్యకి చెప్ప వద్దన్నాడు' అంది లలిత.

'అది నాకు చూపించి—నా వారసురాలు. నా కేదైనా హఠాత్తుగా ప్రమాదం జరిగితే నువ్వు పూచీ వహిస్తావు కదూ' అంటూ అడిగాడు. రామచంద్రం ఏం అడిగినా నేను కాదనను — మా ఇద్దరిమధ్యా ఆత్మీయత అలాంటిది. నేను ప్రామిస్ చేశాను — అతని కేదో దూరదృష్టి ఉన్నట్టే ఉంది—ఆ వెళ్ళడం వెళ్ళడం మళ్ళీ రానేలేదు—లాయరే నన్ను కలిసి, అతను గుండెపోటుతో మరణించాడనీ, ఆస్తికి సంబంధించిన కాగితాలు మీకు ఇమ్మన్నారనీ అందించాడు ... అందుకనే అప్పటినుంచి మీ అత్తయ్యతోకూడా లావా దేవీలు జరిపాను. నీకు తెలిసే ఉంటుంది నా కావిడ బాగా తెలుసునని ...' ఆగాడు బలరాం.

'తెలుసు. అవకాశం చిక్కినప్పుడల్లా యీ ఊరు విశేషాలు చెప్తూనే ఉండేది... మీలాంటి ఉత్తముడైన యువకుడు ఈ కాలానికి చాలా అరుదని ఆవిడ అభిప్రాయం' ...నవ్వింది.

'నేను కాలంవాడిని కానే కాదుగా ...' తనూ నవ్వేశాడు బలరాం. 'ఇదంతా ఎందుకు చెప్పానో తెలుస్తోందాని...నిన్నో భారంగా నేను ఎప్పుడూ భావించలేదు. రామచంద్రం నా కెంత కావలసినవాడో చెప్తే, నీకు అర్థంఅవుతుందని చెప్పాను...ఇక వేరేదారి ఉందేమో నన్న ఆలోచన మరిచిపో. నీకు పెళ్ళిచేసి ఓ యింటిదాన్ని చేసి పంపించే దాకా నాదే బాధ్యత అని గ్రహించు. సరేనా ? ఏది ఆ చెయ్యి ఇలా తే.' అంటూ ఆదరణగా చేయి ముందుకి చాచాడు. తనూ నెమ్మదిగా తనచేతిని అతని చేతిలో ఉంచింది.

'మనం స్నేహంగా ఉండాలి. శత్రువులం కాదు లలితా, ఆసంగతి ఇక మరిచిపో— సరేనా' అన్నాడు తన చేతిలో ఉన్న చేతిని మృదువుగా నొక్కుతూ.

'థ్యాంక్యూ, కాని సరస్వతమ్మగారికి అనవసరంగా శ్రమ—అని ... నా బ్రతుకు నేను బ్రతక కల్గినప్పుడు అనవసరంగా యింకోళ్ళని యిబ్బంది పెట్టడం ఎందుకని...'

'సరళని చూస్తే అత్తయ్య శ్రమ ఎంతటిదో తెలుస్తుందికదా !' గట్టిగా నవ్వేశాడు. చేయి వదులుతూ 'రా. యిప్పుడు నా రోజా మొక్కలు చూడు—' అంటూ మడిలోకి దారి తీశాడు.

మడిలో మధ్యమధ్యన ఉన్న సన్నని గట్టుమీద అతనివెనక నడుస్తున్న లలిత గుండెలు తేలిక పడ్డట్టయ్యాయి. 'కనీసం యీయన నన్ను భారం అనుకోడు' అన్న ఊహ గమ్మత్తుగా ఉత్సాహాన్నిచ్చింది.

'ఓసారేమైందో తెలుసా?' అంటూ కుతూహలంగా అంది...నడుస్తున్న వాడల్లా సన్నని గట్టుమీదే నిలబడి వెనక్కు తిరిగాడు బలరాం.

'ఏమైంది ?' కుతూహలంగా అడిగాడు.

'నన్ను ఎప్పుడు ఓసారి పంపించమని అడిగినా—ఆడదిక్కులేని కొంపలోకి ఎలా

వంపిస్తాననుకున్నావు?' అనేది అత్తయ్య. వాకేతోచింది 'పోనీ నన్ను పెళ్ళాడు మామయ్య నేనే నీకు ఆడ దిక్కవుతాను' అన్నాను...నా చెంప చెళ్ళుమని పించింది అత్తయ్య. అప్పుడే గోరుగుచ్చుకుని-ఇదిగో రక్తం వచ్చింది. చిన్నమచ్చ పడింది — 'పోనే లేదు?' అంటూ తన చెంపమీద కంటికి కొంచెం కిందుగా ఉన్న సన్నని రేఖలాంటి మచ్చని చూపింది బలరాంకి.

'పోనీలే రామచంద్రం జ్ఞాపకాలలో ఆ మచ్చ మిగిలి ఉంటుంది. అవునా?' మృదువుగా మచ్చని తాకుతూ అన్నాడు బలరాం.

'మచ్చ లేక పోయినా నేను మామయ్యని మరిచిపోలేను బలరాంగారూ, నిరుత్సాహం నన్ను ముంచెత్తినప్పుడు — మామయ్యే ఉంటే బాగుండును, అనుకుంటాను ఇప్పటికీ,' కళ్ళలో నీటిపొర తేలింది లలితకి. ఎదురుగా ఉన్న బలరాం మసగగా కన్పించాడు. అతని కళ్ళు నక్షత్రాల్లాగా వెలుగుతున్నాయి.

'అప్పుడు నిజంగా రామచంద్రం అదృష్టవంతుడు లలితా, నాకతనంటే జెలసీ రాకుండా చూసుకోవాలిప్పుడు.'

'మీకేం మీకన్నీ ఉన్నాయి. అదృష్టవంతులు' అంది లలిత నవ్వేస్తూ.

'అవును. ఒక్క హృదయం యిచ్చి నన్ను నాకై కోరేవాళ్ళు తప్ప' అన్నాడు.

'సారీ బలంరాంగారూ, నేనలా అని అన లేదు' తడబడింది లలిత.

'నోనో, నువ్వన్నా వన్నానా.'

ఆ క్షణంలో కవచం తొలగిన వీరుడిలాగా తోచాడు బలరాం. చేయి చాపి మృదువుగా అతని చేయి తాకింది ఓదార్పుగా.

'రా, మొక్కలు చూసి లోపలికి వెడదాం.'

'సరే నడవండి' అంది లలిత.

'అదిగో అండీలు వద్దు. నన్ను నీకు కావలసినవాడని అనుకోకపోతేనే అలా అంటావని భావిస్తాను. బలరాం అనుచాలు.' అన్నాడు.

'పదండి బలరాం' అంది నవ్వుతూ.

'అదిగో ...' దుడుకుగా వెనక్కి తిరిగాడు బలరాం కాలు సన్నని గట్టు మీదనుంచి జారి వెనక్కి పడపోయాడు. అప్రతంగా చేయి అందించింది లలిత. నిలదొక్కు కున్నాడు

'పద బలరాం. చీకట్లు కమ్ముకు వస్తున్నాయి. చెట్లున్నచోట చీకటి త్వరగా వచ్చినట్టు ఉంటుంది కదూ?' అంది లలిత. అతనికి చేయి అందించి నందుకు —హఠాత్తుగా సిగ్గేసింది లలితకి...కాని అదేమంత గుర్తించినట్టే లేదు అతను.

'ఈ రోజెస్ పెంచడం చాలా కష్టం చూశావా? యీ ఎల్లోవి. పూస్తే చాలా అందంగా ఉంటుంది—బంగారపు పువ్వుకి సువాసన ఉన్నట్టుంటుంది.

'మీకు పసుపురంగు ఇష్టమా?'

'ఎరుపురంగు కూడా!' అన్నాడు బలరాం —అప్పుడే సగం విచ్చిన ఎర్ర గులాబి మొగ్గని చూపిస్తూ.

'ఆంధ్రులకి ఎరుపూ తెలుపూ కూడా ఇష్టం అంటారు ... నేను తెల్లచీరలు కడితే నా అరవ కొలీగ్స్ వేళాకోళం చేసేవారు—ఆంధ్రా అని' అంది.

'తెలుగు వనిత ఎర్రని నేతచీరలో ఎంత హుందాగా ఉంటుందో వాళ్ళకేం తెలుసు?' అంటూ చేతికి అంటిన మట్టి దులుపుకుని...నిఠారుగా నిలబడ్డాడు.

'సరళకి స్నేహితులకి కొదవ లేదు. ఆమె అడ్డమైనవాళ్ళనీ చేరతీస్తుంది. పార్టీ లిస్తుంది. పార్టీలంటూ వెడుతుంది. మీ ఇద్దరూ ఒక వయస్సువాళ్ళు కనుక స్నేహంగా ఉండొచ్చు. కాని ఈ సంగతి జ్ఞాపకం పెట్టుకుంటావని చెప్తున్నాను. సరళ స్నేహితులంతా నా యిష్టులని నువ్వు అనుకోకు. అదే నా క్కావలిసింది ...' అన్నాడు

'అలాంటి వాళ్ళంతా ఇక్కు ఎలా వస్తారు?' భయంగా అడిగింది లలిత.

'నీకు ప్రపంచం తెలియదు. అందుకే సంరక్షకు డుండాలన్నారు.' నవ్వేసి ఇంటి వెనకవైపు తోటలోకి దారితీశాడు బలరాం.

అతనిమాటలు అర్థంకాక అతనివెనకనే నడవడం ప్రారంభించింది.

'మీమంతవాలయ్యాయనుకుంటాను!' అన్నమాట విని ఉలిక్కిపడి తలెత్తింది లలిత.

పిట్టగోడమీద వయ్యారంగా కూర్చుంది సరళ. పుస్తకం ఒళ్ళో ఉంది.

'అయ్యాయి. ఏం పనుందా?' అడిగాడు బలరాం.

'లేదనుకో. అయినా ఇంత ఇల్లుండగా తోటలోనూ నీరోజెస్ దగ్గరా ఏం మంతనాలు బలరాం—నే ఊహించవచ్చా?' కొంటెగా అడిగింది.

'షటప్' అంటూ గబగబ వెనక మెట్లెక్కి ముందుకి సాగాడు బలరాం.

'మొక్కలు చూద్దాం అని నేనూ దిగాను. ఆయనా వస్తున్నారు. సరేకదా అని ఇద్దరం కలిసి చూశాం.' వివరించింది లలిత.

'అంతేనా? నీ కంట్లో నలుసేదైనా పడిందేమో తీవ్రంగా చూస్తున్నాడేమ కున్నాను'

గడచిపోయిన ఆ దృశ్యం తలచుకుని లలిత ఒళ్ళు పులకరించింది ... సరళ చూసిందన్నమాట. తనచేయి బలరాం






కోయిలపేరు తెలియని వారెవరు ? దీనికంఠం విననివారుండరు కదా ! మన దేశంలోని కవులేకాక ప్రపంచ ప్రసిద్ధ కవులు చాలమంది దాని కంఠంగురించి 'గానం' చేసారు. ఇది ఒక 'వలసపక్షి' అంటే సంవత్సరంలో కొంతకాలం ఒక ప్రాంతంలోను, మిగతా కాలం వేరు ప్రాంతాల్లోను గడుపుతుంది. యూరపు లోని కోయిలలు చలికాలం రాగానే తిండి కరువయి ఆఫ్రికాకు పోతాయి. ఎండాకాలంలో తిరిగి యూరపుకు వచ్చి చేరతాయి. అక్కడ గుడ్లుపెడతాయి. వాటినుండి పిల్లలు వస్తాయి. ఈ సందర్భంగా కోయిలకున్న ఒకగుణం చెప్పాలి. అది చెడ్డగుణం అనుకోండి లేదా చమత్కారితనం అనుకోండి.

కోయిల తనకుతాను గూడు కట్టుకోదు. ఇతర పక్షులగూడు చూసి, సమయం కనిపెట్టి, ఆ పక్షిగూడులో తన గుడ్లు పెట్టేస్తుంది. కుదిరితే ఆ పక్షిగుడ్లను ఈ కోయిల తోసేస్తుంది కూడా. పాపం ఆ పక్షి కోయిల గుడ్లను పొదిగి పిల్లలుచేసుకొంటుంది. ఆ పక్షి గుడ్లంటె ఈ పిల్లలు తోసేస్తాయి. కోయిల పిల్లలు ఎదిగి, పెంపుడుతల్లి 'నోటి'తిండి తిని, పెరిగి పెద్దవవుతాయి. వేరుజాతులు కాబట్టి ఒక్కోసారి పిల్లలే పెంపుడుతల్లి కంటే పెద్దవయి పోతాయి. మన దేశంలో కోయిల కాకి గూళ్లలో గుడ్లను పడుతుందని ప్రసిద్ధం.

ఇలా పిల్లలు పెరిగి పెద్దవయే సరికి, తీరా పెద్దకోయిలలు చలికాలం రావడంవల్ల ఆ ప్రాంతాలు వదిలి పోతాయి. అయినా వేలాదిమైళ్ళ— వాటికి తోవబాగా తెలిసినట్టుగానే— కోయిలపిల్లలు ఎగిరిపోతాయి.

అమెరికా కోయిలకు మాత్రం ఈ చెడుగుణంలేదు. లక్షణంగా తన గూడు కట్టుకొని, స్వంత ఇంటి సుఖం అనుభవిస్తుంది.

కోయిల స్వతహాగా సిగ్గు, పిరికి తనం, మొహమాటం చూపిస్తుంది. అసలు దానికంఠము విన్నవారే కాని దానిని చూసినవారు అరుదు. అంత లౌక్యంగా సంచరిస్తుంది. అందుకే ఒక కవి 'నిన్ను కోయిలా ! కోయిలా అని అననా, కదలిపోయే స్వరములే అని అననా !' అన్నాడు దీనికంఠ మాధుర్యాన్ని, సిగ్గును ప్రశంసిస్తూ !

—ఐమ్మి కోనేటిరావు.

## ప్రేమించు ప్రేమకై

అందుకోడం, బలరాం జారిపోతే తను చేయి అందించడం అన్నీ చూసి ఉంటుందన్న మాట. మూగగా నిలచిపోయిన లలితని చూసి 'ఏం కంట్లో ఏం పడలేదా?' రెట్టించింది సరళ.

'లేదు, నా చెంపమీది మచ్చ చూస్తున్నా రంతే' ధైర్యంగా ముఖం పెట్టి అంది లలిత.

'అదా, పాపం బలరాం, చంద్రునికి మచ్చ ఉండగా లేంది ఈ లలితకుంటే ఏం బలరాం.' అంది అక్కడలేని బలరాంని. ఉద్దేశించి.

లలిత బిక్కమొహంపెట్టింది.

'మీరెప్పుడూ ఇలా వ్యంగ్యంగానే మాట్లాడుతారా?'

'వ్యంగ్యమా? వచ్చినిజం అయితేనూ... నువ్వే పది పన్నెండేళ్లదాని వో వెంటపడి ప్రాణాలు తీస్తారు కాబోలు అనుకున్నాడు బలరాం. ఫరవాలేదు—లే—నే చూస్తే. అమ్మ చూస్తేనే బాగుండదు' అంది అక్కడికి లలిత ఏదో కూడనిపని చేసినట్టు.

సమాధానం చెప్పకుండా లలిత మేడ మెట్లవైపు పరుగెత్తింది. ఇదేం మనుషులు? పట్నంలో మనుషులు లేక ఒంటరితనం, ఇక్కడ ఉండీ ఒంటరితనం తనకి తప్పదా? అని బాధపడుతూ లైటేనా వేసుకోకుండా మంచంమీద పడుకుంది.

'దేమిటమ్మాయిగారూ దీపం పెట్టుకోలేదు' అంటూ రత్తి వచ్చింది.

'రత్తీ నేను నిద్దరపోతాను. నన్ను భోజనానికి కూడ లేపొద్దను' అంది.

'అయితే ఓ క్షణం ఉండండి ఓ గ్లాసు పాలు తెస్తాను. తాగి పడుకోండి' అంటూ కిందకి పరుగెత్తింది. కొంచెం సేపటికి వంటావిడ వచ్చారు గ్లాసుతో.

'అదే మంచిదమ్మాయి, అడపా తడపా ఇలా ఉంటేనే నయం. సుష్టుగా భోజనాలు చేసి కూర్చుంటే — ఇదిగో నాలాగే తయారవుతావు' అంటూ నవ్వి పాలగ్లాసు ఖాళీది పట్టుకు వెళ్లిపోయారు.

లలిత అలాగే నిద్రపోయింది. నిద్రలో ఆమె మనసు బలరాంకీ, మోహన్‌కీ మామయ్యకి మధ్య ఊయెలలూగింది...

(ఇంకా ఉంది)

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధువులకు సహాయం చేస్తారు.

**వృషభం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:** ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:** వ్యాపారంలో పోటీదారితో పోటీ పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులు ఏర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**సింహం:** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల ముమ్ముందు కూడా ఉపయోగం ఉంటుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసివస్తుంది. రాజకీయ వ్యవహారాలలో చికాకులు ఏర్పడతాయి. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** మీరు ఎంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. అధికారులవల్ల

# వారఫలం

## 20-12-1968 శుక్రవారం మొదలు 26-12-1968 గురువారం వరకు

జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు— దైవ కార్యాలు నెరవేరతాయి. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయ్యగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**ధనుస్సు:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగాఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మకరం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు వారం ఆఖరులో బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం:** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ చాలకాలు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులకు గురికాగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

—మహేష్ ●

---

ఇదిగో తల్లీ... ఏడిచే సన్నివేశం అయిపోయిందమ్మా... ఇక ఆపు






'శారదా'

ఉలిక్కిపడి వెనక్కి తిరిగాను నా ఊహా ప్రపంచాన్నొదిలి — కాని ఏమీ మాట్లాడకుండా ముఖంలోకి చూస్తున్నాను. ఎర్రగా మత్తుగా ఉన్న కళ్లతో 'ఏమిటి ? నీకేమైంది? అలా గుడ్లప్పగించి చూస్తావ్? — ఇవాళ రమ భోజనానికొస్తుంది—కాస్త స్పెషల్ ఫుడ్‌గా ప్రిపేర్ చెయ్యి— నీ తెలుగు తెలివితేటలొదిలి పెట్టి—' మరి సమాధానం కోసం కూడా చూడకుండా వెళ్లిపోయారు.

నాకా కళ్లని చూస్తే మొదట్లో ఎందుకో చాలా భయంగా ఉండేది. నా ముఖంలో ఆ భయం ప్రస్ఫుటం గాకుండా ఉండాలని విశ్వప్రయత్నంచేసి కూడా కృతకృత్యురాల్ని కాలేకపోయేదాన్ని. ఏనాడూ ముఖంలోకి చూసి మాట్లాడటమనేదే జరిగేదికాదు — కాని అలా ఉండటానికి వీలయ్యేదికాదు.

'ఏం ? ఎందుకలా తలవాల్చి మాట్లాడతావ్ — నీ మంచితనానికి మురిసిపోతాననా ? కాస్త తల పైకెత్తి ఇటువైపు చూసి మాట్లాడు-చదువు — నీ చదువు సంస్కారం ఏమైనాయి — నీ ప్రవర్తనని నిర్లక్ష్యం చేస్తున్నకొద్దీ నీలో అహం పెరిగిపోతోంది. నా కిటువంటి ప్రవర్తనంటే పరమ అసహ్యం.

ఏమాత్రం ఆప్యాయతలేని కటువైన మాటలు నా చెవుల్లోకి దూసుకుపోయేవి. నిస్సహాయంగా కళ్లు పైకెత్తేదాన్నికాని ఆ చూపులు అలా ఒక్కక్షణంకూడా నిలిచేవికావు—వెంటనే అప్రయత్నంగా కళ్లు క్రిందికి వాలిపోయేవి.

దేన్నైతే మర్చిపోవాలని నా చేతినిండా పని కల్పించుకుంటున్నానో అది మర్చిపోవటం నాకు సాధ్యం కావటం లేదు. పిచ్చి పిచ్చిగా భూత భవిష్యద్వర్తమానపు సంఘటనలన్నీ నన్ను చుట్టు ముట్టుతూనే ఉన్నాయి.

ఎమ్. ఏ. తెలుగు ప్యాస్ అయ్యాక నా వివాహం చాలా ఘనంగానే చేశారు. ఒక్కర్తినే ఆడపిల్లనవటం కారణంగా నా మాటకి ఎదురే వుండేదికాదు. అందుకే చిన్నతనంలో వివాహంచేసి ముద్దు ముచ్చట్లు కళ్లారా చూడాలని తాతయ్య, బామ్మ ఎంత అభిలషించినా మొండితనంగా నేను చదువుకుంటానని మారాం చేస్తే నామాట తీసివెయ్యలేకపోయారు. ఎమ్. ఏ. పూర్తి చెయ్యగానే నా వివాహం చెయ్యాలన్న పట్టుదల, తాపత్రయం పెరిగిపోయాయి. దాన్ని కాదనేశక్తి నాలోనూ లేదు. నేనేమీ పెళ్లి చేసుకోకుండా ఆ జన్మ బ్రహ్మచారిణిలా ఉండి పోవాలనుకోలేదు. కాని అనుకున్నంత సులభం కాలేదు మా నాన్నగారికి నా వివాహం చెయ్యటం. కట్నం అడిగినంత యివ్వగలరు కాని, అందం ఎక్కడినించి తెస్తారు. ఏదో సాధారణంగా ఉండే నా రూపం మా నాన్నగారికి, తాత

య్యకి నచ్చిన వరునికి నచ్చేదికాదు. మా బామ్మ నా కాబోయేభర్త నవమన్మథుడై ఉండాలనుకునేది. మా బామ్మ కోర్కెలు చూస్తే నాకు నవ్వు వచ్చేది—తన మనుమ రాలేమైనా 'రంభా' 'ఊర్వశా' చేసుకో బోయేవాడంత నవమన్మథుడు కావడానికి. మా అన్నయ్యకి అంద చందాలతో నిమిత్తం లేదు. నన్ను చేసుకోబోయేవాడు నన్నొక దేవతలా పూజించాలనేవాడు.'

'అలా కాకుండా నీ పట్ల ఏమాత్రం నిర్లక్ష్యం చూపించినా వాడి చర్మం వొలిచేస్తాను చెల్లాయ్' అంటే,

'అప్పుడు నీ ముద్దుల చెల్లాయ్ ఇంకా బాధపడదూ!— వాళ్ల ఆయన్ని కొట్టావని'—అని నవ్వుతూండేదాన్ని—

'తమాషాలు కాదు చెల్లాయ్—నే చెప్పే ప్రతి అక్షరం నిజం—అలా జరిగిందంటే వాడిరక్తం కళ్ల చూస్తాను'—

ఆ మాటల్లో ఉన్నపట్టుదల, కోపం చూస్తే భయంవేసేది. మా నాన్నగారి దృష్టిలో అతను ఓ డాక్టరేట్ తీసుకున్న వాడైనా అయుండాలి. ఈ కోర్కెలతో, అన్వేషణతో మరో రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. అన్నయ్య స్నేహితుడు శేఖరం 'కొంచెం దూరం బంధువు. పేరు మధూ' అంటూ పరిచయం చేశాడు నాన్న గారికి ఈయన్ని. ఆయన అందరికీ నచ్చారు. నన్ను చేసుకోవడానికి ఏమీ అభ్యంతరమూ చెప్పలేదు—మా వివాహం జరిగిపోయింది.

మొదటిరోజు గదిలో అడుగుపెట్ట నప్పుడు తెలిసింది ఆయనకి నేనంటే ఏమీ ఇష్టం లేదని—

'అంత ఇష్టం లేనివారు నన్నెందుకు చేసుకున్నారు?' అన్నాను పౌరుషంగా!

'అమ్మకీ, నాన్నగారికీ నచ్చావ్...బహుశా నీ డబ్బు నచ్చి ఉండచ్చు. వాళ్లకి నచ్చిన అమ్మాయి నాకు నచ్చదూ—నాకు నచ్చిన అమ్మాయి వాళ్లకి నచ్చదూ—ఏదో ఒక నాటికి ఎవళ్లమో ఒకళ్లం సర్దుకోక తప్పదు. పెద్దవాళ్ల మనసు కష్టపెట్టట మెందుకని బి సి. నాటి నీ కట్టూ బొట్టూ నచ్చకపోయినా 'సరే' నన్నాను. నాకు నువ్వంటే ఇష్టంలేదు, అంటే నిన్ను నా భార్యగా ఊహించుకోవడం నా కిష్ట ముండదు. అయినా పెళ్లి చేసుకున్నాను కనక నువ్వు నాతోపాటు నా యింట్లో ఉండటాన్ని మాత్రం ఎలాగో సహిస్తాను. దీన్ని సహించాననకా అని భార్యననే భావంతో నామీద ఏమైనా అధికారం చూపించబోయినా, ప్రశ్నించ బోయినా నేనేమాత్రం సహించలేను — నేను ఎలా ప్రవర్తించినా సహించి ఊరుకోగలిగితేఉండు. లేకపోతే— అంటె నీ కిష్టం లేకపోతే పుట్టింట్లోనే ఉండు' అంటూ అతి తేలికగా చెప్పి ఓ తలగడా నామీదకి విసిరి,

'ఇక నాకు నిద్రవస్తోంది. లైటార్పెయ్' అన్నారు. నాకు విపరీతమైనకోపం వచ్చింది.

'ఎందుకో ఇంతజాలి?—ఈతలగడా ఇవ్వడానికి—దీనికోసమే బెంగపెట్టుకుంటున్నా ననుకున్నారు కాబోలు...జీవితాలతో ఆటలాడు కోవటమంటే వీరికెందుకో అంత సరదా?—నేను ఈయనకి చేసిన అపకార మేమిటి? నాజీవితాన్నెందుకిలా నాశనంచేసి ఆనందిస్తారు?—నేనన్నయ్యతోచెప్తే ఇటో అటో తేల్చేస్తాడు—నేను తన కవసరం లేనప్పుడు నేనా ఇంటికెందుకు వెళ్ళాలి? ఏమైనాసరే వెళ్లకూడదు'

అని నిశ్చయించుకుని ఆ నేలమీదే తలగడలో ముఖందాచుకు పడుకున్నాను. నాకళ్ల నించి అప్రయత్నంగా జారిన కన్నీళ్లు తలగడను తడిపి ముద్దచేస్తున్నాయి. వాటిని అరికట్టాలని ప్రయత్నించినా సాధ్యం కాలేదు. విధి నామీద పగపట్టి కక్షతీర్చుకుంటున్నట్లనిపించింది. నిద్రదరికి చేరాలని ఎంత ప్రయత్నించినా ఆయనలాగే అదీ నాకు దూరంగానే నిలిచిపోయింది. దాని చేరువకు చేరుకోవటం నాకు సాధ్యం కాలేదు. అమ్మపిలుపుతో తెల్లవారి లేచానే కాని అద్దంలో నాముఖం చూసుకున్న నాకు భయం వేసింది అలా కనిపించటానికి. ఇంట్లో ఎవరికైనా ఈవిషయం ఎలా చెప్పాలో కూడ నాకర్థంకాలేదు. అన్నయ్యని తలుచుకుంటేనే భయంవేసింది. సాధ్యమైనంత మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తూ తలుపు తెరిచి 'ఏమిటమ్మా! అప్పుడే లేపేశావ్? నా కెంత నిద్ర వస్తోందో తెలుసా?' అంటూ బద్ధకంగా అక్కడేఉన్న బామ్మ పక్కమీదికిపోయి పడుకున్నాను.

'పోనీలేవే రాజ్యం—పడుకోని. రాత్రంతా నిద్రలేదు కాబోలు' అన్న బామ్మమాటలు వినిపించాయి.

'నిద్ర లేకపోవటమైతే నిజమే—కాని బామ్మ అనుకుంటున్న కారణమా? అది మాత్రంకాదు...' అని నాలోనేనే అనుకున్నాను.

అలాగే పడుకుని ఆలోచిస్తున్న నేను అన్నయ్యకి చెప్పటాన్ని విరమించుకున్నాను, అన్నయ్య అనేమాటలు చెవుల్లో ప్రతిధ్వనించటం మొదలుపెట్టాయి. ఇక్కడే ఉండిపోవటం కారణంగా అమ్మా, నాన్నగారూ బామ్మా, తాతయ్యా... వీళ్లంతా బాధ పడతారు. అన్నయ్యకోపంతో రెచ్చిపోతాడు—అంతేతప్ప నేను పొందదలిగేదీ, సాధించేదీ ఏముంది? ఇక్కడున్నా, అక్కడున్నా నాకు ఒకటే—పోగా అక్కడేఉంటే అధమం వీళ్లైనా తృప్తిగా ఆనందంగా ఉంటారు' అని ఒక నిశ్చయానికివచ్చి లేచి మామూలుగా తిరగడానికి ప్రయత్నించాను. అన్నయ్య. 'ఏం చెల్లాయ్ అంత ముభావంగా ఉన్నావ్? ఇవాళ వెళ్లావంటే మళ్లీ ఎప్పుడొస్తావో?—కాస్త హుషారుగా ఉండు' అంటూ మొదలుపెట్టాడు. అందుకు సమాధానంగా ఒక్క చిరునవ్వుకంటే ఏమీ ఇవ్వలేకపోయాను.

మా అత్తగారూ మామగారూ మాతో పాటుండేవారుకారు. పల్లెలో ఉండేవారు. ఇక ఉండేది మే మిద్దరమూను — ఇక్కడికి వచ్చాక ఆయన ఇంకాబాగా అర్థమయ్యారు. రాత్రి ఎప్పుడో అర్ధరాత్రివేళ ఇంటికి చేరుకునేవారు ... మత్తుగాతాగి ఎర్రటి కళ్లతో. మొదట్లో అర్థమయేది కాదు ఆయన ఎక్కణ్ణించి వస్తున్నారో. ఆటు తరువాత తెలిసింది నైట్‌క్లబ్‌నుంచి వస్తారని. ఆకళ్లుచూస్తే భయమేసేది—ఒక్కర్తినీ ఆయనతో ఆ పరిస్థితుల్లో ఉండాలని తలుచుకున్నప్పుడల్లా అక్కణ్ణించి పారిపోవాలనిపించేది. ఎప్పుడు ఇంటికి వచ్చినా ఎవరోఒక అమ్మాయిని వెంటబెట్టుకుని వచ్చేవారు. అంతా ఆధునికంగా తయారయ్యామనుకున్న నాగరకులే—ఎత్తు మడమల జోళ్లు, లిప్‌స్టిక్, నైలాన్‌చీరె, స్లీవ్‌లెస్ బ్లౌజ్, లేదా గౌను, బాబ్డ్ హెయిర్—ఆ రకమైన ఆధునికతను వారు ఇష్టపడేది—పాశ్చాత్య నాగరకతాదాసులైన స్త్రీలు వారికి కావలసింది—మనకి ఒక నాగరకత లేదని ఇతరుల ననుకరించటం—దేశ

కాల పరిస్థితుల ననుసరించి పరివర్తనం కరణ ఉండాలేకాని ఇతరులనెందుకు కమక రించాలి?—వీరి ప్రవర్తననిచూసి ఇంట్లో పనిమనుషులుండటాన్ని సహించలేక వాళ్ళని మాన్పించి ఆ పనంతా నేనే చేసేదాన్ని. ఆపనిలో ఏమాత్రం లోపంవచ్చినా మండిపడే వారు. ఆమాటల్లో కటుత్వం, ఆకళ్ళల్లో ఎరుపు, ఆచూపుల్లో వాడి — చూస్తే భయం వేసేది. కాని రోజులు గడుస్తున్న కొద్దీ నాలో నిర్లక్ష్యం పెరిగిపోయింది. అవేవీ నాకు సంబంధించనట్లు ప్రవర్తించే దాన్ని.

ఇలాఉండగా ఒకనాడు పిడుగులాటి అన్నయ్య ఉత్తరం వచ్చింది. 'నిన్ను చూసి చాలారోజులయింది. ఎప్పుడు రమ్మన్నా ఏదో ఒక సాకు చెబుతూనే ఉన్నావ్ తాతయ్యా బామ్మా నీకోసం బెంగపెట్టుకున్నారు. అందుకని నేనొస్తున్నాను. నాతోపాటు నువ్వుకూడా రావాలి?' అంటూ...

'ఏం చెయ్యాలో తోచలేదు. అంతవరకూ ఎప్పుడూ ఆయనతో ఏ విషయాన్నిగురించీ మాట్లాడలేదు. నేను చెప్పింది ఎంతవరకు వింటారో కూడ నాకు నమ్మకంలేదు. అయినా ఒక నిశ్చయానికొచ్చి ఆ రోజు సాయంత్రం ఆయనతో.

'రేపు అన్నయ్యొస్తున్నాడు' అన్నాను.

'అయితే నన్నేం చెయ్యమంటావ్?'

# శారద

'నేను మీ యింటికొచ్చాక ఎప్పుడూ ఏదీ అడగలేదు. కాని ఇవాళ మిమ్మల్నొకటడుగుదా మనుకుంటున్నాను— మీరు అదొక్కటే చెయ్యండి ... నేను మిమ్మల్ని ఏదో అధికార పూర్వకంగా అడగటం లేదు...' అంటూ నేలమీద బొటనవ్రేలితో రాస్తూ నిల్చున్నాను.

'ఏవిటది ?'

'అన్నయ్యున్న రెండురోజులూ మీరు ఎవర్నీ ఇంటికి తీసుకురాకండి...'

'ఏం ? ఎందుకని ?—మీ అన్నయ్యని చూసి నే నెందుకు భయపడాలి ?'

చాలా కటువుగా, కోపంగా ఉన్నాయా మాటలు. నా నిట్టూర్పుని ప్రయత్న పూర్వకంగా త్రొక్కిపట్టి.

'అన్నయ్య చాలా కోపిష్టి. ఇదిచూస్తే ఎలా ప్రవర్తిస్తాడో కూడా చెప్పలేను ... తనని ఆపటం ఆ బ్రహ్మతరంకూడా కాదు. నాకు బాధకలిగించే విషయమేదైనా జరి గిందని తననుకుంటే ఏమాత్రం సహించ లేడు.'

'అంత బాధకలిగించే ట్లయితే ఇక్క డెవరుండ మన్నారు ? మీ అన్నయ్యతో పాటు నువ్వూ వెళ్ళు...'

'అలాగే అనుకుంటె మీతోపాటు అసలు వచ్చుండేదాన్నే కాదు. మీరు మీ తలిదం డ్రులకోసం నామెడలో తాళి ఎలాకట్టారో అలాగే నా వాళ్ళకోసం మీదగ్గర ఉన్నాను ...మీరు అన్నయ్య వచ్చాక వాళ్ళని తీసుకు వస్తే ఇక్కడనేనుండటం ఎలాగా జర గదు...' అని కొంచెం సేపాగాను. నాలోనూ నిర్లక్ష్యం పెరిగింది. మాటల్లో ఆ భావం వ్యక్తం చెయ్యకుండా ఉండలేక పోయాను.

'అయినా అన్నయ్య వచ్చినంతమాత్రాన నాకొచ్చే నష్టమేమీ లేదు. ఉండే నష్ట మంతా మీకే...'

'అంటే'

'బావుంది...దానికి నేనేం సమాధానం చెప్తాను. మీరే ఆలోచించుకోండి' అని నిర్లక్ష్యంగా వెనక్కి తిరిగాను.

'శారదా ? ... ఏవిటా తొందర ... వాళ్ళని రా వ ద్దన్నా మానరు. నన్నేం చెయ్యమంటావ్...ఏదో ఒకటి చెప్పు— ప్లీజ్—త్వరగా.'

మాటల్లో ఆతృత, స్వార్థం. అసహ్యం వేసింది 'ఆయనేమయితే నా కెందుకు ? వార్ని చూసి నే నెందుకు జాలి పడాలి ?' అని ఒక్క క్షణం అనుకున్నాను. కాని దాన్నణచుకుని.

'నే చెప్పినట్లు చేస్తారా' అన్నాను.

'ఆఁ ! తప్పకుండా చేస్తాను...చెప్పు'

'మీకు అర్జంటుగా ఊరు కెళ్ళ వలసిన పనుందని చెప్పి వెళ్ళిపోండి. ఒక వారం రోజులు పోయిన తరువాత రండి. అప్పటికి ఏదో ఒకటి చెప్పి అన్నయ్యని పంపేస్తాను.'

ఏ మనుకున్నారో 'సరే' నని వెళ్ళి పోయారు.

మర్నాడు సాయంత్రం ఆయన ఫోన్ చేసి అర్జంటుగా ఊరు కెళ్ళవలసిన పనుందనీ, ఇంటికి రాగానే వెళ్ళిపోవాలి కనుక బట్టలన్నీ సర్ది ఉంచమనీ చెప్పారు. అన్నయ్యకు క్షమాపణలు చెప్పుకుని వెళ్ళి పోయారు.

'ఆయన లేకుండా ఎలా వస్తాను చెప్పు? ఎప్పటి కొస్తారో కూడా సరిగా తెలియదు. మళ్ళీ సారికి తప్పకుండా వస్తాను కదూ !' అంటూ అన్నయ్యకు ఎలాగో సర్ది చెప్పి పంపేశాను.

'శారదా ! మాకు భోజనం పెట్టెయ్.'



'నా ఆలోచనలకి 'అంతరాయం కలిగింది. పనంతా ముగించుకుని పోయి పడుకున్నా ఏవో ఆలోచనలు చుట్టు ముడుతూనే ఉన్నాయి. ఆ ఆలోచన్ల మధ్య ఎప్పుడు నిద్ర పట్టిందో కూడా తెలియదు.

మర్నాడు సెలవు పెట్టి ఇంట్లోనే ఉన్నారు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నేను ఇక్కడి కొచ్చి దాదాపు సంవత్సరం కావస్తోంది. కాని ఎప్పుడూ ఆయన ఇలా ఇంట్లో లేరు. రాత్రి భోజనం కూడా త్వరగా పూర్తి చేశారు. నేను పని పూర్తి చేసుకుని నా గదిలో కొచ్చి కళాపూర్ణోదయం చదువుకుంటున్నాను.

'శారదా.'

నా గదిలోకి ఆయనెప్పుడూ రాలేదు. 'ఎప్పుడూ ఒంటరిగా ఇంట్లో ఉండటం అలవాటులేదు. తోచలేదు కాబోలు' అనుకుంటూ 'ఎందు కిలా వచ్చారు ?' అన్నట్టు ప్రశ్నార్థకముఖంతో లేచి నిల్చున్నాను. 'ఏమిటి ? కూర్చోమనైనా అనవ్—...నువ్వు పడుకునే దెక్కడ ?' వేలితో అక్కడే ఉన్న చాప చూపించాను.

'అక్కడెలా పడుకోగలవ్ ?'

'తలగడను ఆధారంగా చేసుకుని కటికి నేలమీదే పడుకోగలిగినదాన్ని చాపమీద పడుకోటానికేం' అనుకుని చిన్నగా నవ్వి.

'నా కలవాటే' అన్నాను.

# శారద

'నాకేమీ తోచటంలేదు'

నేను మౌనంగానే ఉన్నాను.

'నువ్వు చాలా అనాగరకంగా ఉంటావ్, నువ్వూ రమా వాళ్లలా ఆధునికంగా ఉంటే చాలా బావుంటావ్...అయినా...ఇవాళ ఈ చీరలోనే ఎందుకో...అందంగా కన్పిస్తున్నావ్...'

ఈ సంభాషణ, మాటలంతీరు అసహ్యాన్ని కలిగిస్తున్నాయి—కాని భర్త — సహిస్తూ మౌనంగా ఊరుకున్నాను,

'శారదా ! నేను నీ భర్తని...నిన్ను పొందే అధికారం నాకు లేదంటావా ?'.

కళ్లలో మత్తు—

'ఛీ ! మనిషేనా—ఇంత సిగ్గులేదేం ?'

ఎంత అసహ్యించుకో కూడదనుకున్నా నాలో జుగుప్స, అసహ్యం పెరిగిపోతున్నాయి...దగ్గరగా వచ్చి నా చెయ్యి పుచ్చుకున్నారు. నాలో అపరిమితమైన ఆవేశం కలిగింది. ఒక్కసారి చెయ్యి విదిలించుకుని పక్కకి జరిగాను. ఆయన అహం దెబ్బతింది. ముఖం కోపంతో జేవురించింది.

'నేను నీ భర్తని—నీ యిష్టానిష్టాలతో నాకు సంబంధంలేదు. నీమీద నాకు సంపూర్ణాధికారం ఉంది.'—ఆవేశంగా ఉన్నాయి మాటలు.

'అవును మీలో మానవత్వ మనేది ఏమైనా ఉంటేగా?—పశుబలం చూపించగలరు...అదేగా మీరు చెప్పేది...'

'ఏమిటి నువ్వనేది ? నేను పశువునా? ఛీ—చదువుకున్నావేకాని సివిలిజేషన్ చిన్న మెత్తులేని దానివి ... భర్తపట్ల గౌరవం నీసమెత్తు కూడాలేదు—అనాగరికత ప్రబలి పోయింది—'

నాలోనూ విచక్షణా జ్ఞానం నశించి పోయింది.

'అవును—అప్యాయత, ప్రేమలేని కామం పశుత్వం అనిపించుకోక మానవత్వం అనిపించుకుంటుందా— భార్యగా నన్ను మీరే మాత్రం అభిమానించ గలుగుతున్నారు? మిమ్మల్ని నేను గౌరవించటానికి...పైగా నాగరకత సివిలిజేషన్—ఈ పదాలు ఉచ్చరించే అర్హతకూడా మీకు లేదు.

'నాగరకత'—అంటే ఏమిటి ?—మీకూ అనాగరక జాతికీ భేదమేమిటి? ఆదిమ నివాసులకు వివాహబంధం లేదు. వాళ్ళు స్వేచ్ఛా విహారులు— నాగరకత పెరిగిన కొద్దీ వివాహమని కొన్ని కట్టుబాట్లు ఏర్పడ్డాయి. మీరూ వారిలాగే స్వేచ్ఛా విహారులు—ఇక వేషధారణంటారా మానవుడు ప్రప్రథమంలో దుస్తులను ధరించటం అవసరమనుకోలేదు. సివిలిజేషన్ పెరుగుతున్న కొద్దీ దుస్తులను ధరించటం అలవరచుకున్నాడు మానవుడు. నిండుగా చీర ధరించటం నాగరకత అవుతుంది కాని... మరే వేషధారణా నాగరకత అనిపించుకోదు. నాగరకత పురోగమిస్తున్న రోజుల్లో తిరోగమిస్తున్న మీరు నాగరికులెలా అవుతారు... మీలో ఇంకా కాస్తో కూస్తో మానవత్వం మిగిలి ఉందనుకున్నాను. ఇప్పుడు అది కూడా లేదని బుజువు పరుచుకున్నారు... ఛీ!— ఈరోజు మిమ్మల్ని చూస్తూంటే నాకసహ్యం వేస్తూంది...'

అప్పటికి కాని నా వాగ్ధోరణి కట్టుబడలేదు. అప్పుడర్థమైంది ఏం మాట్లాడానో— నాలో ఆవేశం నెమ్మదిగా చల్లారింది. ఆయన ముఖంలోకి చూశాను. మాటలేకుండా ఎన్నో భావాలు మిశ్రితమైన ముఖం—అది కోపమో, మార్పో... మరేమిటో...



స్టువార్ట్ గ్రిఫిన్

# గెయిషా ప్రపంచంలో మార్పులు

'ఆడదానిగా పుట్టటం కన్నా విచారకరమయినది వేరే లేదు' అని ఒక జపాన్ సామెత. అయితే గెయిషాల విషయంలో మాత్రం ఇది ఏమాత్రం నిజంకాదు. ఎందుకంటే జపాన్ దేశంలోని గెయిషాలు తమ యూనియన్ ఒకటి సృష్టించుకుని తమ 'హక్కులని' కాపాడుకుంటున్నారు.

రెండవ ప్రపంచయుద్ధం ముందు జపాన్‌లో గెయిషాల జీవితం సుఖమయంగా ఉండేది కాదనే అనాలి. గౌరవం అయితే ఉండేదికాని ఇబ్బందులు కూడా అధికంగానే ఉండేవి. నేడు వారి యూనియన్ పుణ్యమా అని గెయిషాలకి నిర్ణీతమయిన వేతనాలూ, పనివేళలూ, సాలీనంగా వచ్చే బోనస్‌లూ, అనారోగ్యం సెలవూ, ఉద్యోగంపోతే పరిహారం, జీతంతో సెలవూ—ఇవన్నీ ఉన్నాయి! వారూ తక్కిన కార్మికులవంటి వారేనని నిరూపించుకున్నారు.

## పేచీలు

గెయిషాల యూనియన్‌లు 1950 ప్రాంతాలలో ప్రారంభం అయ్యాయి. వారి వేతనాల విషయంలో ఎన్నో పేచీలు వచ్చాయి. ఒక గెయిషా వేతనం కేవలం ఆమె అనుభవంమీద ఆధారపడి ఉండాలా లేక ఆమె సామర్థ్యం (ఆటపాటలలో) మీద ఆధారపడి ఉండాలా? ఈ వివాదంవల్ల కొన్ని 'గెయిషాగృహాల'కి ఎదురుగా సమ్మెలు కూడా జరిపించాయి యూనియన్లు!

ఈ నాడు గెయిషా జీవితంలో కొంచెం సుస్థిరత ఏర్పడింది. ఒక గెయిషా రోజుకి నాలుగుగంటలు మాత్రం పనిచేస్తూ ఉంటుంది (సగటున) ఆమె పనివేళలు సాయంత్రం 7 నుంచి రాత్రి 11 దాకా ఉంటాయి. ఆదివారాలు సెలవు. వేతనాలని యూనియన్‌వారే నిర్ణయిస్తారు. ఇవి గెయిషాలు పనిచేసే 'తేనీరు గృహాల' స్థాయిని, స్తోమతని పట్టి ఉంటాయి. వారు 'టిప్' (కొసరు!) పుచ్చుకోవచ్చు ఇష్టం వచ్చిన చోట నివసించవచ్చు.

## కెంబాన్

గెయిషాలకి ఉద్యోగసంస్థ ఒకటి ఉంది. దీనిని 'కెంబాన్' అంటారు. ఎవరయినా గెయిషాపార్టీ కావాలి అనుకుంటే ఈ కెంబాన్‌ని అడుగుతారు. బేరాల తర్వాత ఏర్పాట్లు అవుతాయి. ఏర్పాట్లు సవ్యంగా ఉన్నదీ లేనిదీ యూనియన్లు చూస్తుంటాయి.

## పేరు

అయితే యూనియన్ల కర్తవ్యం కేవలం గెయిషాల ఆదాయాలని రక్షించ



క్రమంగా మాయమవుతున్న 'మెయికో'ల్లో ఒకర్తు

# గెయిషా...

టమేకాదు. వారి పేరుని కాపాడటం కూడా వారి కర్తవ్యాలలో ఒకటి. ఎందరో వేశ్యలు గెయిషాలకింద చలామణి అవటంవల్ల రెండు రకాలవారిని వేరుగా ఉంచేందుకు కొన్ని కట్టుదిట్టాలు చేశారు.

## పరీక్షలు

ప్రతి సంవత్సరం ప్రభుత్వంవారు ఒక క్లిష్టమయిన పరీక్ష జరుపుతారు. ఇందులో రాసేవీ, చెప్పచెప్పేవీ కూడా ఉంటాయి. —'గెయిషా' అంటే కళలలో ప్రావీణ్యం ఉన్నవ్యక్తి అని అర్థం. నాట్యం, సంగీతం, సంభాషణ—వాటిలో ప్రావీణ్యం ఉండాలి. లేని వనితలు గెయిషాలుకారు, అన్నది ఒక గెయిషా యూనియన్ అధికారి.

## పరీక్షభయం

ఈ పరీక్షలని చూసి భయపడిపోయి ఎందరో అమ్మాయిలు ఇతర వృత్తులలో చేరుతున్నారు. రెండవ ప్రపంచయుద్ధం ముందు 11 సంవత్సరాల అమ్మాయిలు 'మెయికో'లుగా చేరేవారు. మెయికో అంటే నాట్యకత్తెగా తర్ఫీదుపొందుతున్న అమ్మాయి అన్నమాట. యుద్ధానంతరం వృత్తికీ వయసుకీ సంబంధించిన శాసనాలు రావటంతో మెయికోపద్ధతి మారిపోయింది.

మే 1964 లో 18 సంవత్సరాల కిందవారు అసలే ఉద్యోగాలు చెయ్యరాదనే చట్టం వచ్చింది. దీనితో గెయిషా వృత్తికి చిన్నప్పటినుంచి క్రమశిక్షణ ఇవ్వటం అసాధ్యం అయింది—18 దాకా అందరూ పాఠశాలలకి వెళ్ళాలి జపానులో.

కొందరు గెయిషా వృత్తి ఈ శతాబ్దానికి పనికిరాదంటారు. కాని ఎందరో గెయిషాలు మాత్రం, సంఖ్య తగ్గినప్పటికీ, ఇంకా నిలుస్తారనే దృఢనిశ్చయంతో తమ వృత్తిని కొనసాగిస్తున్నారు...

(శ్రీ. జ. కి.)●




**జరిగిన కథ**

సావిత్రమ్మ ఒక మధ్యతరగతి ఇల్లాలు. ఆమె భర్త రామనరసయ్య. పెద్దకొడుకు గోపీ వారాలు చేసుకుని హైస్కూల్లో చదువుకుంటూ వుంటాడు. విధిలేక చిన్నవాడు మురళిని నరసింహానికి పెంపకం ఇస్తుంది. గోపీ తెలివి తేటల్ని గ్రహించి అతనికి తన ఇంటిలోనే వసతి ఏర్పాటు చేస్తాడు ప్రొఫెసరు. అతని కుమార్తె అనిత. అనిత ప్రవర్తన గోపీకి నచ్చదు. గోపీ ఆచోటు విడిచి పెట్టేస్తాడు విదేశాలకి వెళ్తాడు. విమల కాన్వెంటులో చేరి మార్గరెట్‌గా మారుతుంది. విమల త్రుణీకరించిన సంబంధాన్ని చేసుకుని కమల రాధిక అవుతుంది ఫారిన్‌లో గోపీకి పద్మినితో పరిచయమవుతుంది.

# 12

[illegible] భుజమ్మీద తువాలు కప్పుకుని కుర్చీలో కూర్చుని ఉన్నాడు గోపీ. అతడి చేతిలో ఉత్తరం గాలికి రెప రెప లాడుతున్నది. అతడు శూన్యంలోకి చూస్తున్నాడు. చప్పుడు లేకుండా పద్మిని లోపలికి వచ్చి అతడికి ప్రక్కగా నిలబడి భుజంమీద చెయ్యి వేసింది.

చేతో ఆమె చెయ్యి తీసివేస్తూ 'నాతో సరసాలు ఇంక చాలించు అనితా' అన్నాడు ముఖం త్రిప్పుకుంటూ.

అతడిని ఆ స్థితిలో చూసినందుకే ఆశ్చర్యపడుతున్న పద్మిని ఈ విదలింపుకు మరింత ఆశ్చర్యానికి లోనైంది.

'అనితా అంటాడు, ఎవరిని?'

మామూలుగా పలకరించినట్టు ఆనాడు 'హలో గోపీ' అంటూ ఎదురుగా నిలబడలేకపోయింది పద్మిని, ప్రాణంవులా అక్కడే నిలబడి పోయింది.

గోపీ మెల్లగాలేచి ఉత్తరం బల్లమీద పడేసి తల ఎత్తిచూచాడు. పద్మిని అతడి వంకే చూస్తూ నిలబడి పోయింది.

'హలో పద్మినీ ఎప్పుడు వచ్చారు? ఎంత సేపయింది వచ్చి?' ఆలోచనల నుండి తేరుకుని ఆమె కెదురుగా నిలబడి పెదవుల మీదికి నవ్వు తెప్పించుకున్నాడు.

'చాలా సేపయింది. దొరగారు ఏదో ఉత్తరం చేతిలో పట్టుకుని ఆలోచనలో పడ్డారు. నాచేతిని విదలించి కొట్టారు.' బుంగమూతితో జవాబిచ్చింది.

'క్షమించు పద్మినీ, ఏదో ఆలోచనలో ఉన్నాను. అది నీచెయ్యి అనుకోలేదు.' ఆమె చేతిని ప్రేమతో తన చేతిలోకి తీసుకున్నాడు.

'మరెవరిదను కున్నావు?' అందామని నాలుక చివరివరకూ వచ్చింది పద్మినికి.

'పద్మినీ—నాకు రహస్యాలు లేవు. ఈ ఉత్తరం చదువుకో, సందేహాలుంటే నన్నడుగు, అంతేకాని—నీలో నీవే మధన పడకూడదు. అది ఆరోగ్య లక్షణంకాదు.'

'రహస్యాలు లేవన్నంత మాత్రాన ఎట్లా లేకుండా పోతాయి? నేను ఇతరుల ఉత్తరం చదవను' ముఖం గంభీరంగా పెట్టింది.

ఆమెను తన కుర్చీ చేతిమీద కూర్చో బెట్టుకుంటూ.

'పద్మినీ, నీ నా మధ్య అరమరికలు లేవు ఉండవు, ఈ ఉత్తరం చదివితే నీకు అర్థమవుతుంది. మిగతా సంగతులు నేను చెప్పివేస్తాను' చేతిగాజులు సవరించాడు.

'ఊహూ—ముందు చెప్పు తరువాతనే చదువుతా. 'అనితా' అంటూ నా చెయ్యి విదిలించేశావెందుకు? ముందు చెప్పు' అతడి హృదయానికి తలవేసి రాస్తూ గునిసింది.

అనిత సంగతంతా టూకీగా చెప్పాడు గోపీ.

అతడి షర్టుకు అంటిన తన బొట్టును చూసుకుని పద్మిని సిగ్గుపడి తిరిగి, ముఖాన్ని అతడి గుండెలో దాచుకున్నది.

'నేను యిక్కడికి రావటానికి అనితే కారణం. అనితే లేకపోతే నేను మామూలు డాక్టరుగా ఎక్కడో ఉద్యోగం చేస్తూ ఉండేవాడిని. ఇంతదూరం ఎట్లా వస్తాను?' అన్నాడు ఆమె తలను రెండుచేతులతో పట్టుకుని, ఆమె చెయ్యివిప్పి ఉత్తరం పెట్టాడు దానిలో.

అనితకు పెళ్లి అయిందట. కాని వరుడు కామేశం కాదుట. ప్రకాష్ అనే డాక్టరుతో వివాహం జరిగింది. అతడికి విజయనగరంలో ఉద్యోగం. పెళ్లయిన ఏడు నెలలకు అనిత ఆడపిల్లను ప్రసవించింది.

'పద్మినీ, ఆ చివర పేరా చదువు వింటాను' గోపీ ఆమె ముఖంలోకి చూశాడు.

'గోపీ ఆ పిల్లను చూస్తుంటే మన సంతా వికలమయిపోతున్నది. పసిబిడ్డను చూడగానే గుండెకు హత్తుకుని ముద్దుం పెట్టుకుందామనిపిస్తుంది. కాని అంతలోనే ఎక్కడలేని అసహ్యమూ జుగుప్స కలుగుతాయి. ఆ పాప కామేశం బిడ్డ. దుర్మార్గుడయిన కామేశం రక్తమన్న కక్ష పెల్లుబికి పైకి లేస్తుంది. ఏ పాపం ఎరుగని ఆ ప్రకాష్ బలవంతంగా ఈ పిల్లకు తండ్రి అవటమేమిటి? ప్రకాష్ పాపను ఎత్తుకోవాలని చేతులు చాపుతూ మురిపెంతో వస్తాడు. నాకు అతడిచేతికి ఈ పాపఫలాన్ని అందివ్వ బుద్ధికాదు. నా ముఖంచూసి విన్వెరపోతాడు. ఇట్లా వుంది నా జీవితం

గోప్ప ఒక ప్రక్క అనహాము—ఒక ప్రక్క ఆనందము, ఒకప్రక్క అనురాగము—ఒక ప్రక్క వైరాగ్యమూ—వెలుగు నీడల మధ్య వెలా వెలా పోతూ జీవిస్తున్నాను. నాకు మనశ్శాంతి ఎట్లా కలుగుతుంది? ఎప్పుడు కలుగుతుంది ?

నీవూ నేనూ ఒక గది లో బల్లకు అటుప్రక్క నీవూ ఇటు ప్రక్క నేనూ కుర్చీలు ఊగుస్తూ కూర్చుని చదువుకున్న రోజులు జ్ఞాపకానికి వస్తున్నాయి. వాటిని దుర్వినియోగము చేసుకున్నాను. అయినా నా జీవితంలో అవే మంచిరోజులు.

నా దుఃఖాన్ని విచారాన్ని పోగొట్టి నాకు మనశ్శాంతి కలిగే టట్టుగా ఈ అభాగ్యురాలికి ఒకజాబు వ్రాయవూ ?

అనిత.

చదివి అతడి చేతికి ఇచ్చేసింది ఉత్తరం పద్మిని.

'ఇదీ సంగతి. దీన్ని నీవేమీ అపార్థం చేసుకోలేదు కదూ ? ఆమెకేదో ఒక సమాధానం వ్రాస్తాలే. పద. అట్లా బైటికి వెళ్ళివద్దాము. అరే. నేను ఇంతవరకూ టీ తీసుకోలేదు. చేసుకుందాం రా—లోపలికి.'

'ఉండు. నేను చేసుకు వస్తా.'

ఐదు నిమిషాలలో పద్మిని టీ చేసి బల్ల మీద పెట్టింది. బిస్కెట్లతో కూడా ఇద్దరూ టీ తీసుకున్నారు.

'లేద్దామా?'

'ఎక్కడికి?'

ఇద్దరూ గల గల నవ్వుకుంటూ లేచారు.

* * •

సావిత్రమ్మ తన బట్టలు సంచీలో పెట్టుకుని రాధిక దగ్గరికి ప్రయాణమయింది. వెళ్ళేటప్పుడు ఒకసారి మురళిని చూడాలనిపించింది. వాకిట్లోకి వెళ్ళగానే పెద్దకుక్క ఒకటి అరచి మీద పడపోయింది. ఆ అరుపుకు సుబ్బయ్య లోపలి నుంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

'సుబ్బయ్యా ! మురళి కులాసాగా ఉన్నాడా?' అడిగింది సావిత్రమ్మ ముందుకు అడుగులేస్తూ.

'బాబుగారు అబ్బాయిగారిని తీసుకుని బెంగుళూరు వెళ్ళారండి.'

'ఎన్నాళ్ళయింది వెళ్ళి? మళ్ళీ ఎప్పుడు వస్తారు?' ఆత్రంతో ప్రశ్నించింది.

'వెళ్ళి పదిహేనురోజులయిందండి. మరో నెల కావచ్చునండి రావటానికి ఇప్పుడందరికి సెలవులు గదండి.'

మురళిని గురించి ఆలోచిస్తూ ఆయింటి వైపుచూస్తూ నిలబడిపోయింది సావిత్రమ్మ. తను సమకూర్చలేని భోగాలు మురళి ఆ యింట్లో అనుభవిస్తున్నాడు. కాని తనకు దూరమయిపోతున్నాడు.

మెల్లగా అడుగులువేసుకుంటూ సావిత్రమ్మ



ఇంటికి వెళ్లింది. ఆ పూట వకీలుగా రింటికి వెళ్లదలచుకోలేదు. ఇటునుంచే స్టేషనుకు వెళ్లదలచుకున్నది.

తీసి భద్రపరచేది ఆ యింట్లో విలువ గల వస్తువు ఒక్కటే—రామనరసయ్య ఫోటో. అది వర్షపుజల్లుకు చెడిపోతుందని తీసి చుట్టూ గుడ్డలు చుట్టి పెట్టె అడుగున పెట్టింది. ఉన్న ఆ ఒక్క నులక మంచం గోడకు ఎత్తింది. వంటపొయ్యిమీద బుట్ట బోర్లించింది. ఇల్లు నాలుగు మూలలూ ఒకసారి చూసి తలుపు గొళ్లెము పెట్టి తాళం వేసింది.

నాలుగడుగులు వేసిందో లేదో సాంబయ్య గారింటినుంచి మనిషి వచ్చాడు. చెప్పి వెళ్ల వచ్చుకదా అనుకుని బయలుదేరింది సావిత్రమ్మ.

సాయంకాలము ఆరుగంటలు దాటింది. సావిత్రమ్మను చూడగానే అందరూ చుట్టూ మూగారు. అలస్యం ఎందుకయిందంటూ ప్రశ్నల వర్షం కురిపించారు.

'శాంతమ్మగారూ నేను ఏడుగంటల రైలులో అమ్మాయి దగ్గరికి వెళ్లాలను కుంటున్నాను.' అన్నది సంచి గోడకానిస్తూ.

'వెళ్లిపోతారా ? మళ్లీ ఎన్నాళ్లకు వస్తారు?' అందరూ ఆదుర్దాగా ప్రశ్నించారు.

'మీకు ఇదివరకు చెప్పానుకదండీ. మా అమ్మాయికి పురిటిరోజులని ! పురిటికి వస్తు రమ్మని అమ్మాయి చెప్పింది. వాళ్లత్తగారు కూడా రమ్మని ఉత్తరం వ్రాయించింది. వెళ్లాలి.'

# జీవితవలయాలు

సావిత్రమ్మ వెళ్లుతుందనగానే పడుకున్న శాంతమ్మ లేచి కూర్చోబోయింది. పిల్లలంతా 'అయ్యో వెళ్లిపోతారా?' అన్నారు ఒక్కసారి.

'పిల్లనిచ్చామన్న మాటేగాని నేను ఇంత వరకూ ఆ గడప తొక్కి చూడలేదు. ఇంత కాలం ఎలాగో జరిగిపోయిందిగాని ఇప్పుడు పురిటిరోజులు. అందులో మొదటి కాన్పు. వెళ్లితీరాలి.'

మాటల్లోపడి శాంతమ్మ గడియారం వంక చూసుకోలేదు.

'సావిత్రమ్మగారూ? ఈ పాదంతో నేను లేచి ఎట్లా తిరగను? ఎన్నిసార్లు తిరిగితే ఒకపూట గడుస్తుంది? అందరికీ ఉదయం తొమ్మిది గంటలకల్లా వంట కావాలి' కళ్ల నీళ్లు తుడుచుకుంది శాంతమ్మ.

'అదేమిటి అలా అధైర్యపడి కన్నీళ్లు కారుస్తారు? నేను పంతులుగారికి చెప్పాను మనిషిని చూడమని. మీరు మాత్రం ఆకాలు అట్లా ఉండగా తిరగకండి. తిరిగితే నొప్పి ఎక్కువయి కాలు మరింతగా వాచిపోతుంది.

'తిరగలేనండి. కాని తిరగకపోతే జరిగే టట్లు కనబడలేదు. ఎట్లాగడుస్తుందో?'

సావిత్రమ్మకు ఆ పూట రైలు దాటి పోయింది.




సావిత్రమ్మ గబగబా వంటయింట్లోకి వెళ్లి పొయ్యిలో నిప్పువేసింది. పెరటి బావిలోనుంచి బిందెడు నీళ్లుతెచ్చి వంట చేసింది. అంతలో పిల్లలంతా వచ్చి భోజనాలకు కూర్చున్నారు.

'ఏమండోయ్ మామ్మగారూ. మీరైలు కాస్తా వెళ్లిపోయింది' నవ్వారు పిల్లలు చప్పట్లుకొడుతూ.

'వెళ్లిపోయింది బాబూ — కాని రేపు ఉదయం ఏడుగంటలకు మళ్లీ వస్తుంది!'

కథలూ కబుర్లు చెప్పి సావిత్రమ్మ వాళ్లను నవ్విస్తూ వడ్డించింది.

ముసలమ్మగారు తృప్తిగా ఫలహారం చేసి 'సావిత్రమ్మా అయితే వెళ్లిపోతావా ? మళ్లీ ఎప్పుడు వస్తావు ?' అడిగింది పీటమీదినుంచి మళ్లీ మంచం చేరుకుంటూ.

ఉదయం సావిత్రమ్మ నిద్రలేచే సరికి వాకిట్లో సాంబయ్యగారి మనిషి నిలబడి ఉన్నాడు. అప్పుడు వెళ్లిన సావిత్రమ్మ ఆ పూటకూడా గడిపింది. సాయంత్రము వరకూ చూసింది. ఇంకో మనిషి రాలేదు. శాంతమ్మ పాదము కదల్చలేకుండా ఉన్నది. సాంబయ్యగారు వస్తూనే 'సావిత్రమ్మగారూ ఎవరూ దొరకలేదండి. ఏం చెయ్యాలో తోచటంలేదు. వంట ఎట్లా చేస్తారోకూడా తెలియనివాడిని. అయినా దాని మరివం దగ్గరే కుంపటి పెట్టుకుని వంట నేర్చుకుంటాను.'

సావిత్రమ్మ, శాంతమ్మ విరగబడి నవ్వారు.

'ఈ యింట్లో కాస్తా కూస్తా వంటా మీరు నేర్చుకుని చెయ్యటానికి ?' సావిత్రమ్మ నవ్వలేక గోడకానుకుని పోయింది.

'ఏంచెయ్యను మరి? పిల్లలంతా చిన్న వాళ్లాయెను. ఆమె ముసలమ్మ. ఈమె కాలికి నొప్పి. ఎట్లామరి ?'

సావిత్రమ్మ మనసు అసలే వెన్న. గోరు వెచ్చదనానికి కరగిపోతుంది. 'అయితే పంతులుగారూ, మీరు మనిషికోసము వెతుకుతూ ఉండండి, మీకు మనిషి దొరికే వరకూ నేను ఉంటాను. ఉన్నన్నాళ్లూ ఉండి మీరు ఇబ్బందితో ఉండగా ఎట్లా వెళ్లుతాను?'

సాంబశివరావు గారికి కొండ నెక్కినంత సంతోషం కలిగింది. చప్పున వొంగి

ఆమె పాదాలమీద కళ్ళకు అద్దుకోవాలన్నంత పూజ్య భావం కలిగింది.

'అయితే సరే; నేను యిప్పటినుండే మనిషికోసం ఊరంతా తిరుగుతాను, దొరక్కపోతుందా? మీరు దేవతలాంటి వారు. మమ్మల్ని ఈ ఆపదలోనుంచి కాపాడిన వారయ్యారు. నాలుగంటే నాలుగురోజులు టైము యివ్వండి' అంటూ బయటికి వెళ్ళాడు.

* * *

ఓరవాకిలిగా ఉన్న తలుపులు నెట్టుకుంటూ లోపలికి వస్తున్న యామినిని చూసి 'ఎప్పుడొచ్చావు?' ఆశ్చర్యంతో కనుబొమలు పైకెత్తుతూ ఒళ్ళంతా కళ్ళు చేసుకుంటూ చూసింది హనుమాయమ్మగారు.

'నెల్లాళ్ళయింది పిన్నిగారూ'

'నెల్లాళ్ళయిందా? మరి కనబడలేదేం?'

'ఆయనకు కాలికి ఫ్రాక్చరయిందండీ.'

'నీకెట్లా తెలిసింది? ఇప్పుడెట్లా ఉంది?'

'కాలికి ప్లాస్టరు వేశారు. నడవలేరు.'

'ఈ సంగతి నీకెట్లా తెలిసిందని అడుగుతున్నాను'

'మా అన్నయ్య స్నేహితుడు మావారి ఆఫీసులో పని చేస్తున్నాడు. ఆయన ద్వారా తెలిసింది. వెంటనే బయలు దేరాను.'

'యామినీ నిన్ను చూస్తుంటే నాకెంతో సంతోషంగా ఉంటుంది. ఉన్నమాట చెప్పద్దూ? అప్పుడు నీవు వెళ్ళిపోవటం నాకెంత మాత్రం యిష్టంలేదు. కాని నీవు చాలా ఉద్రేకంలో ఉన్నావు. ఇంక నిన్ను నేను ఆపలేననుకున్నాను.' హనుమాయమ్మగారు ఆమెను దగ్గరగా కూర్చోబెట్టుకుని జడ సవరిస్తూ అన్నారు.

'నన్ను మనిషిగా చూడని ఆ యింట్లో ఉండ బుద్ధిపుట్టలేదు పిన్నిగారూ. వెళ్లేటప్పుడయినా ఒక్కమాట ఆయన వద్దని అని ఉంటే ఉండిపోయేదాన్నే. కనీసం నా వంక ఒకసారి చూసినా వెళ్ళలేక పోయేదాన్ని. తలవంచుకుని ఉదాసీనంగా ఊరుకున్నారు. ఆయన నిర్లక్ష్యాన్ని చూసి ఒళ్ళు మండిపోయి వెళ్ళాను' ఉద్రేకం వల్ల ఆమె ముఖం ఎర్రబడిపోయింది.

'పోనీలే నీ కర్తవ్యం ఏమిటో తెలుసుకుని మళ్ళీ వచ్చావు—నాకదే సంతోషం'.

# జీవితవలయాలు

'ఈ కబురు విన్నతరువాత ఒక్కక్షణం అక్కడ ఉండలేక పోయాను. వెధవ రైలు. ఇరవై నాలుగంటలు నడిచింది. నాకేమో ఎప్పుడు ఇక్కడికి వచ్చి వాల్దామా అన్న ఆత్రము. ఆ ఆలస్యాన్ని భరించలేకపోయా ననుకోండి.'

నవ్వాపుకోలేక పోయింది హనుమాయమ్మగారు.

'నిన్నుచూసి ఇంట్లోవాళ్ళంతా ఏమన్నారు? ఎందుకు వచ్చావు మళ్ళీ అని అడగలేదు?'

'ఎందుకడుగుతారు? అడిగితే నేను నాలుగూ అడగనూ? నా కదే ఆశ్చర్యం పిన్నిగారూ. ఆయనకంత బాధగా ఉంటే వాళ్ళకు చీమ కుట్టినట్లయినా లేదు. పైగా ఇంట్లో అది లేదనీ ఇదిలేదనీ హేళన—సామాను తీసుకురాలేదని విసుగు—వాళ్ళకు మానవత్వము ఏకోశానయినా ఉందో లేదోననిపిస్తోంది.'

'వాళ్ల మాటసరే. మీ ఆయన మాటమ్మానే నడిగేది ?'

'ఆయనా ?' నిస్పృహతో కూడిన నవ్వొకటి యామిని నవ్వింది. 'ఆయన మాటల్లో రాగమూ ఉండదు— వైరాగ్యమూ ఉండదు. వాసనా ఉండదు — రంగు అంతకంటె ఉండదు. వెళ్లితే ఎందుకు వెళ్ళావనీ లేదు. వస్తే ఎందుకు వచ్చావనీ లేదు. నేను వెళ్ళి ఏడాదికి పైగా అయింది. ఏమీ జరగనట్లే—ఇంతకాలంగా నేను ఇక్కడ ఉన్నట్లే మామూలుగా ఉన్నారు.'

యామిని ముఖం వంకే వింతగా చూస్తోంది హనుమాయమ్మగారు.

'కాని—పిన్నిగారూ. ఆ గదిలో అడుగు పెట్టి ఆయన్ను చూడగానే నా దుఃఖం కట్టలు తెంచుకుంది.' కళ్ళల్లో నీళ్లు తిరిగాయి యామినికి.

యామినిని దగ్గరికి తీసుకుంటూ 'నీ సంగతి నాకు తెలుసు. నీవు వెళ్లేనాడే నేను గ్రహించాను. కోపంతో వెళ్లేవాళ్ళను ఎవరూ ఆపలేరు. చూడు యామినీ నీవు వెళ్ళనూ వెళ్లావు. ఎంతో అనుభవం సంపాదించుకుని రానూ వచ్చావు' అన్నది. ఆమె కళ్ళు ఆనందంతో మెరిసి పోతున్నాయి.

'అదే పిన్నిగారూ ఆ నిర్వికార హృదయాన్ని చూస్తే ఒళ్ళుమండి పోతుంది ఒక్కొక్కప్పుడు. కాని ఆయన పట్ల నా హృదయంలో ఉన్న జాలి—ప్రేమ—ఆయన పట్ల ఉన్న పూజ్యభావం—ఆరాధనా భావం నన్ను అక్కడ కూడా ఉండనివ్వలేదు. సంపాదించుకున్నాను. ఖర్చుచేశాను. మనసుకు తృప్తి కలుగలేదు. ఏదో ఆవేదన—తీరని వ్యథ. ఇంక అక్కడ నిలవలేక— నా జాబుకైనా జవాబివ్వని ఆయన దగ్గరికి— ఎవరూ రమ్మని పిలవక పోయినా అభిమానాన్ని చంపుకుని వచ్చాను. ఒక్క పరుగున ఆయన మంచం దగ్గరికి వెళ్ళి కూలబడి పోయాను'

'పిచ్చిపిల్లా నీ హృదయం అతడి కోసం ఎంత ఆరాటపడి పోతోందో అతడు తెలుసుకోలేదు. తెలుసుకుంటేగాని విలువ కట్టలేడు.'

'నన్ను చూడగానే మళ్ళీ వచ్చిందిరోయ్' అనుకుంటూ ఎక్కడ చూసినా వాళ్లిద్దరు గుసగుసలాడటమే. అచ్చుపోసిన ఆంబోతుల్లా అదుపూ ఆజ్ఞాలేకుండా ఉన్నారు ఆయిద్దరు. మళ్ళీ మొదలైంది మా మధ్య మూగ యుద్ధము. ముఖ్యంగా ఆ యిద్దరికి నేను యిక్కడ ఉండటం ఇష్టంలేదు పిన్నిగారూ. పెద్దవాళ్ళు వాళ్ళను ఏమీ అనే స్థితిలో లేరు.'

'మీ ఆయనది ప్రైవేటు ఉద్యోగం అయిపోయింది. లేకపోతే ఇక్కడి నుంచి బదిలీ చేయించుకుంటే హాయిగా ఉండేది. వాళ్లయినా చదువులు కాగానే వెళ్ళిపోరూ? ఇంకా కూర్చుంటారా ఇక్కడ? త్వరగా ఏదో వక పరిష్కారము జరుగుతుందిలే.'

హనుమాయమ్మగారు చూపుతున్న సానుభూతికి యామిని దుఃఖం మరింతగా పొంగింది.

'ఈసారి ఇక్కడికి వచ్చిన తరువాత నా మనసంతా మారిపోయింది పిన్నిగారూ. నా పట్లఎవరు ఎట్లా మెలిగినా నేను లెక్క చెయ్యదలచలేదు. నా కర్తవ్యమేమిటో నిర్ణయించుకుని అలా నడుచుకుపోదలచుకున్నాను. ఎప్పటికయినా ఆయనలో మార్పు రాక పోతుందా అన్న లక్ష్యంతో తలవంచుకుని నా ధర్మాన్ని నేను నిర్వర్తించదలచాను.'

హనుమాయమ్మగారు యామినిని బలంగా హృదయానికి హత్తుకున్నది.

'పిన్నిగారూ! ఎప్పటికయినా నాకు జయం కలుగుతుందంటారా చెప్పండి,

మీరు వెళితే నాకు ధైర్యంగా ఉంటుంది.'

'తప్పకుండా నీకు మంచిరోజులు వస్తాయమ్మా. అధైర్యపడకు' యామిని కళ్ళు తుడిచి ముంగురులు సరిదిద్దింది హనుమాయమ్మగారు.

'నే నొకమాట చెప్పనా? కొంతమందికి అంది పుచ్చుకున్నట్టుగా పెనిమిటి హృదయంలో స్థానం దొరుకుతుంది. కొంత మందికి సాధనమీద దొరుకుతుంది. ఈ రెండవది—కష్టపడి సాధించినదున్నదే—అదే విలువ కలది. నా మాట జ్ఞాపకం పెట్టుకో.'

యామిని కళ్ళల్లో ఆనందం వెల్లి విరిసింది.

(ఇంకా ఉంది)




ఈనాడు సగటు భారతీయ చలనచిత్రాలను చూస్తున్నపుడు నామటుకు నాకు ఒకటనిపిస్తోంది.

'మనం శారీరకంగా స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నామేగానీ, మానసికంగా మనలో ఇంకా బానిసత్వపు చిహ్నాలు మాసిపోలేదేమో?' నని. అందుకు కారణం ఈనాడు మన దేశీయ చిత్రాలూ—ముఖ్యంగా వాటిలోని స్త్రీలపాత్రలూ, ఆపాత్ర ధారిణుల వస్త్రాలంకరణ, వెకిలి శృంగారచేష్టలే! అభిమానమున్న స్త్రీపురుషు లెవరేనా సరే, ఈనాడు సగటు సినిమాలలోని స్త్రీ పాత్రలకూ, వాటిస్వరూప స్వభావాలకూ సిగ్గుతో తలెత్తుక తిరగలేక పోతున్నారంటే అతిశయోక్తి కాదు.

నిజానికీనాడు వస్తున్న మనదేశీయ సినిమాలలోని స్త్రీపాత్రలు—ఏ విదేశీ నగ్న చిత్రాలలోని స్త్రీ పాత్రలకు తీసిపోవటం లేదనిపిస్తోంది. చివరకు సీత, సావిత్రి, లక్ష్మి, సరస్వతి, పార్వతి వగైరా పురాణేతిహాసాలలోని పాత్రలుకూడా, తెరమీద చూపించాలని ఇట్టంలతో, ఆయాపాత్రల స్వభావ, స్వరూపాలనే మార్చుకొని ప్రత్యక్షమౌతున్నాయి! ఇంతటి విదేశీ అనుకరణ వ్యామోహం ఎందుకు? దానివల్ల ఈ స్త్రీ పాత్రల, పాత్రధారిణుల విపరీత వైఖరులవల్ల, మనదేశ వాతావరణమూ, మన దేశ స్త్రీగౌరవ ప్రతిష్ఠలు ఎంత హీన స్థితికి దిగజారుతున్నాయో—పై స్త్రీపాత్ర ధారిణులు ఆలోచిస్తున్నారా?

సినిమాలలో ఈనాడు ప్రత్యక్షమౌతున్న స్త్రీపాత్రల, పాత్రధారిణుల (అర్ధనగ్న (కొన్నిచోట్ల పూర్తినగ్నం అనిపించగల సైట్‌దుస్తులు) వస్త్రాలంకరణ, హద్దు మీరిన వెకిలి శృంగార ప్రదర్శనలతో, యువ తరంవారిలో 'స్త్రీ' అంటే కేవలం సెక్స్ సింబల్‌అనీ— భోగ్యవస్తువు మాత్రమేననే భావం ప్రబలిపోతోంది; ఇదెంత అవమాన కరమైన విషయం?

అంతేకాదు, ఈ స్త్రీ పాత్రలనూ, పాత్ర ధారిణులనూ వారి ధోరణులనూ పరికిస్తున్న కొద్దీ, వీరు నిజంగా స్త్రీలేనా? వీరిలో నటనాశక్తి వున్నదా ? లేక కేవలం తమ అంగాంగ ప్రదర్శన చేసుకోవటమే నటన అనీ కళ అని వీరు భావిస్తున్నారా? ఇలాటి పాత్రలూ—పాత్ర ధారిణులవల్ల సాధారణ కుటుంబాలలోని స్త్రీలలోనూ, యువతరం విద్యార్థినులలోనూ విపరీత అలంకరణ, వెర్రి వెకిలి చేష్టలు పట్ల మోజు పెరిగిపోయే అవకాశం కన్పించటం లేదా ? ఈ పాత్రలు, మన భారతీయ సంస్కృతి, సభ్యతలను ఎంత అసహ్యకరంగా ఎక్స్‌ప్రెస్ చేస్తున్నాయి? ఇందులో ఆ పాత్రధారిణుల బాధ్యత ఎంతేనా వుంది కదా ? అన్న అనేకానేక ప్రశ్నలు మేధావుల మనస్సులను కలవర పెడుతున్నాయి.

షుమారు రెండు దశాబ్దాల క్రితం సినిమాలలో స్త్రీ పాత్రలు, మన దేశ, కాల, వాతావరణాల కనుగుణ్యంగా ఉత్తమ ఆశయాలతోనూ, ఉన్నత నటనా ప్రమాణాలతోనూ, అందంగా, హుందాగా మలచబడి, మన దేశ సంస్కృతి, సభ్యతలకు మెరుగులు దిద్దేవిగా వుండేవి. అంచేతే 'స్త్రీలు సినిమాలలో నటించడం తప్పు కాదు. వారూ గౌరవనీయులే!' అన్న భావాన్ని జనబాహుళ్యంలో ఆ పాత్రలూ—పాత్రధారిణులూ పెంపొందింప జేసారు.

కానీ ఈ నాడు జరుగుతున్న దేమిటి? నటనా శక్తికంటే ఎక్కువగా నగ్న ప్రదర్శనలకే ప్రోత్సాహ మిస్తున్నాయి ఈ స్త్రీ పాత్రలు! కను ముక్కు తీరు అందంగా లేకున్నా, నటనలోని ఏ మెలకువలూ తెలియకున్నా, కనీసం స్ఫుటమైన శబ్దోచ్చారణ (డైలాగ్ డెలివరి) లేకున్నా, కేవలం తమ అంగాంగ ప్రదర్శనతో తారాపథానికి ఎగసిపోతున్న స్త్రీ పాత్రలూ, పాత్రధారిణులు ఎక్కువై పోతున్నారు. పైగా అదే నిజమైన నటన అని మురిసిపోతున్నారు. అలా అని ప్రజల్ని నమ్మించజూడటం ఎంత అవివేకం ? అందు క్కారణం పై రకం స్త్రీపాత్ర ధారిణులూ, 'కళ మాట దేవుడెరుగు కాసులువస్తే చాల'న్న దృక్పథంతో తమ స్వార్థానికి స్త్రీ పాత్రలను అసహ్యకరంగా ఎక్స్‌ప్రెస్ చేస్తున్న దర్శక నిర్మాతలూ కూడా బాధ్యులే! ఇక వర్ధమాన తారలూ అంటే, వారు విదేశీ నగ్నచిత్రాలలోలా పూర్తిగా నగ్నపాత్రలు పోషించటానికైనా వెనుకాడటం లేదు అందుకు గుర్తుగా ఈ నాడు వస్తున్న ఎక్కువభాగం సినిమాలలో స్విమ్మింగ్ డ్రెస్సులలో, నైట్ డ్రెస్‌లలో తయారవుతున్న తారామణులే నిదర్శనం!

మనది ఉష్ణదేశం. A single sign and a simple smile is enough to warm up our bodies అని మనందరికీ తెలుసు. మరి ఈ పాత్రల, పాత్రధారిణుల

విపరీత ధోరణులకూ, వింత వస్త్రధారణలకూ హద్దు అవసరంలేదా ? కేవలం యువతరాన్ని రెచ్చగొట్టటమేనా ఈపాత్రల ధ్యేయం ? ఇదేమాట ఆయా పాత్రధారిణులను కొందరిని ప్రశ్నిస్తే, వారు ఓ అర్థంలేని సమాధానం చెబుతారు.

'నిర్మాతలు పెట్టుబడి పెట్టిన లక్షల డబ్బుకు నష్టం రాకూడదని వారు మా వస్త్రధారణ, పాత్రలు అలా నిర్ణయిస్తారు. ఆమేరకు మేమూ సహకరించి నటించక తప్పటంలేదు !' అంటూ ! ఇది ఓ విధంగా ఆత్మవంచనే తప్ప మరోటికాదు.

నిర్మాతల లక్షల పెట్టుబడికి నష్టం వస్తుందని—తమ శరీరాభిమానాలు వదిలి, బొడ్డుక్రిందికి—బొడ్డు కనిపించేలా పొట్టి పొట్టి పరికిణీలు ధరించాలా ? రిబ్బన్ ముక్కల్లాంటి పీలికల పరికిణీలు ధరించాలా? అసభ్య శృంగారచేష్ట లూ—నన్ని వేశాలూ హద్దూ పద్దూ లేకుండా నటించాలా? తమ వ్యక్తిత్వంమీదా, తమ అభిమానం మీదా తమకెంతైనా నిగ్రహమూ ముక్కువా వుండనవసరంలేదా?

ఈనాడు దేశ విదేశాలలో ప్రదర్శనార్థం వెడుతున్న మన భారతీయ చిత్రాలలోని తమపాత్రలూ, తమనటన, తమ వస్త్రాలంకరణా; తమదేశ సంస్కృతి, సంప్రదాయాల్ని ప్రతిబింబించేదిగానూ, తమదేశ స్త్రీల గౌరవాభిమానాల్ని కాపాడేదిగానూ వుండాలన్న కనీస బాధ్యత, ధ్యేయం తమకు వుండనవసరంలేదా ? నటన ఓ కళే—కాదనను. అది ఈనాడు ఓ వృత్తిగానూ, ఉపాధిగానూ, వ్యాపారంగానూ మారిపోయింది. అయితే, తాము స్త్రీలమన్న ఆత్మాభిమానం విస్మరించి - నటన ముసుగులో స్త్రీల మానాభిమానాలని కలుషితం చేస్తున్న ఈ స్త్రీపాత్రల — ప్రాతధారిణుల ధోరణి మాత్రం గర్హింపదగినదే !

ఇక నిర్మాతలూ — దర్శకులూ కూడా కొంత ఆలోచించాలి. కేవలం తమ స్వార్థం కోసం దేశసంస్కారాన్ని కలుషితం చేయడం, దేశస్త్రీల మానాభిమానాల్ని కించపరచడం ఆత్మద్రోహమేకాదు, ఓ విధంగా దేశద్రోహమూ అనిపిస్తుంది.

ఇక ప్రేక్షకులలోనూ మార్పు రావాలి. స్త్రీ పాత్రల వెకిలి వేషాలకోసం ఎగబడటం, వాటినే ఉత్తమ నటనగా ఆదరించటం ఉత్తమసంస్కార లక్షణంకాదు. అలా ఎగబడకుండా వుండగలిగితే, ఈ స్త్రీ పాత్రల విపరీత ధోరణులకు త్వరలోనే ఓ హద్దు ఏర్పడగలదు.

మొత్తంమీద ఈ నాడు సగటు భారతీయ సినిమాలలోని స్త్రీల పాత్రలు అసహ్య కరంగానూ, అవమాన కరంగానూ వున్నాయి. ఓ ఉత్తమాదర్శంగానీ, ఉన్నత నటనా ప్రమాణాలుగానీ, కనీసం వస్త్రాలంకరణలలో నయినా భారతీయ సాంప్రదాయంగానీ గోచరించడంలేదు ! దానితో సాధారణ కుటుంబాలలోని స్త్రీలలోనూ, విద్యార్థినులలోనూకూడా విపరీత వస్త్రాలంకరణమోజు పెరిగి, స్త్రీల సహజ గాంభీర్యం తగ్గిపోతోంది ! ఇదెంత అవాంఛనీయ పరిస్థితి ?

ఏ దేశ సంస్కృతి అయినా ఆ దేశంలో వెలువడిన ఉత్తమ సాహిత్యంద్వారా అంచనా వేయవచ్చు ఏ దేశ గౌరవ మర్యాదలయినా, ఆ దేశ స్త్రీల ప్రవర్తన, వస్త్రధారణ పవిత్రతలనిబట్టి విలువ కట్టవచ్చు కానీ ఈ నాడు మన సగటు సినిమాలలోని స్త్రీల పాత్రలూ, పాత్రధారిణులూ—వారి అసభ్య నటనా చూచిన, చూస్తున్న ఏ ఇతర దేశస్థులయినా, మనదేశ స్త్రీలపట్ల, మన జాతీయ సంస్కృతి సభ్యతలపట్ల ఎక్కువ గౌరవభావాన్ని పెంపొందించుకోవటానికి అవకాశం లేదనిపిస్తోంది.

అంచేత, ఇక ముందయినా, సినిమాలలోని స్త్రీ పాత్రలు మనదేశ వాస్తవిక సాంప్రదాయాలనుబట్టి వుండటం ఎంతేనా శ్రేయస్కరం. ఆ పాత్ర ధారిణులుకూడా కొంత స్వాభిమానాన్ని, మరికొంత దూర దృష్టినీ—అన్నిటికంటే ముఖ్యమైన మనదేశ స్త్రీల గౌరవాభిమానాల్ని, సమాజ శ్రేయస్సునూ దృష్టిలో వుంచుకు తమ పాత్రలూ—వస్త్రధారణా, నటనలకు ఓ 'హద్దు' ఏర్పరచుకోవటం అవసరం. ఇది విదం. ●








చీకటిపడుతోంది.

గోపాలం వడివడిగా, అంగలు వేసుకుంటూ యింట్లోకి దూరిపోయాడు.

వీధికి ప్రక్కవున్న కిటికీలో నుండి బయటకు చూస్తున్నాడు. అతని హృదయం కలవరపడుతున్నది.

అప్పుడే వెలిగిన ఫ్లొరసెంట్ మునిసిపాలిటీ లైట్లకాంతి గానీ, ఉడుకురక్తంలా పరిగెత్తే కార్లనుగానీ, రోడ్డుమీద చైతన్యవంతంగా సాగిపోయే ప్రజావాహినిని కాదు అతను చూడటం, దూరంగా కిళ్ళీకొట్టువద్ద సైకిలుమీదనే కూర్చుని, వొక కాలు క్రిందికివేసి, మంతనాలు చేస్తున్న కాబూలీవాలా యెప్పుడు వీధినుండి వెళ్ళిపోతాడా ? అని యెదురుచూస్తున్నాడు. కాబూలీవాలా పిల్లికళ్ళు రేడియంలా మెరుస్తాయి. ఆ వీధిలోకివస్తే తనని యెప్పుడు వెన్నాడుతూనే వుంటాయా కళ్ళు.

గది ప్రక్కగా పారే మురికికాలువ కంపు గదినంతా విచిత్రంగా ఆక్రమిస్తోంది. ఇవి చాలక దోమలుకూడా గానసభ ప్రారంభించాయి షడ్జమంలో.

గోపాలం శరీరం చెమటలు పట్టింది. నుదుటినుండి స్వేదబిందువులు జల జలా రాలాయి. గదిలో మూలనవుంది టేబిలు. వొక కాలు విరిగిపోతే, శాంత, నాలుగు విరిగిపోయిన యిటికలుపేర్చి నిలబెట్టింది. తనకి యేనాడో కాలేజిలో ప్రెజెంటు చేసిన ఇంగ్లీషు పుస్తకాలు, నలిగి దుమ్ముపట్టి వున్నాయి, టేబిలుమీద విజయనగర వైభవ సామ్రాజ్యానికి మిగిలిన శిథిల శిల్పాలలా! పదేళ్ళక్రితం పెండ్లి సందర్భంలో, తీయించుకున్న ఫోటోలు, అద్దాలు మసకబారి జిడ్డుతో గోడకు వ్రేలాడుతూన్నాయి. బట్టలుస్టాండు అనబడే దండేంమీద రెండు మూడు మాసికలు వేసిన నూలు చీరలు, రెండు తువాళ్ళు శిధిలావస్థలోయున్న వొక పేంటు, అమెరికన్ బుష్షర్టు, మూలంగా వొక కుక్కిమంచం దాని దిండుమీద కవరు మాసిపోయి చిరిగి వికృతంగా వున్నాయి. కిటికీలోనుండి వెన్నెలలా వీధిలైటు కాంతి. గదినంతా కలియజూశాడు గోపాలం. గోడలు, మాసికలు వడి గోపాలాన్ని పరిహసిస్తువున్నాయి గోపాలానికి వెన్నెముకలో నొప్పి పుట్టింది. యెప్పటికీ కాబూలీ వాలా పోడు.

అది ప్రాక్టీసులేని ప్లీడరుగారిల్లు. సుమారు తొమ్మిదేళ్లనుండి అందులో వుంటున్నాడు. పాతిక రూపాయల అద్దెకు. తొమ్మిదేళ్ళనాడు, తనూ, శాంత, పక్షవాతంతో తీసికుంటున్న తండ్రి వుండేవారు. యిప్పుడు తనూ, శాంత యిద్దరు కూతుళ్ళు వొక కొడుకు.

మళ్ళీ కిటికీలోంచి చూశాడు యెదురింటి మేడలో దీపాలు వెలిగాయి దేదీప్యమానంగా. ఖరీదైనకారు గుమ్మంముందు ఆగింది. యెవరో దిగారు. జరీఖండువాతో, పళ్ళబుట్టలతో. బిళ్ళబంట్రోతు 'సలామ్' కొట్టి లోపలికి తీసుకపోతున్నాడు మర్యాదగా, వినయం అంతా వాడిసొమ్మయినట్లు.

ఇంతలో స్కూటరు ఆగింది. ఆఫీసరుగారి రెండో కూతురు, రెండుజడల అమ్మాయి 'సునంద' తీసుకొచ్చిన బాయ్ ఫ్రెండుకు 'టా-టా' చెబుతోంది నవ్వుతూ. ఆ నవ్వులో ఒకకాంక్ష, ఆ శరీరంలో వొక కదిలిక, ఆ కదలికలో ఒక వుద్రేకం, వుషారు వుంది. మెరుపు మెరిసి నట్లు నడచి యింట్లోకి మాయమయింది.

'అమ్మాయీ! రాధా! రాముడు! రండర్రా భోజనానికి' కేక పెడుతోంది శాంత. గోపాలానికి వినిపించిందా కేక. పిల్లల కోడి పిలుపులా వుంది. యెదురింటి మేడలో

పాశ్చాత్య సంగీతం, శీలగా ఆగుతూ విని పిస్తూ జీవితంలో అపశృతిలా, కలుక్కు మంటోంది.

వాళ్లింట్లో అందరి వదనాల్లో యెల్లప్పుడూ ఆనందం,? అహంకారం. నిర్లక్ష్యం, వోడిపోని వీరుని విజయం లాంటి దర్పం, ప్రతి వొక్కరిలో కనిపిస్తూంది. చివరకు వారు పెంచుతున్న బొచ్చుకుక్క పిల్లల్లో కూడా! పొరుగింట్లో ప్లీడరుగారు టిబి దగ్గు దగ్గుతున్నారు, భగవద్గీత సగం సగం రాగాలాపనచేస్తూ, చదువుతూ.

శాంత గదిలోకి వచ్చి దీపం స్విచ్‌వేసి లైటు కాంతిలో మంగళసూత్రాలు కళ్ల కద్దుకుంది రివాజుగా. ఎదురుగా గోపాలం దొంగలా చెమటలు కక్కుతూ.

'ఏరా' అంది ఆశ్చర్యంగా. గోపాలం హఠాత్తుగా కిటికీ మూసేశాడు. మృత్యు కింకరుని పిలుపులా కాబూలీవాలా బ్యాటరీ బెల్ 'కీచ్'మన్న ధ్వని గుమ్మాల్లో. శాంత బయటకు వెళ్లింది. తనకు మామూలే. క్షణంలో తిరిగివచ్చింది శాంత. 'వెళ్లిపోయాడా' అడిగాడు గోపాలం కళ్లు పెద్దవి చేస్తూ. విసురుగా తల వూపింది శాంత. ఖైదునుండి బయటపడ్డ ఖైదీలా వొక్కసారి వూపిరి పీల్చుకున్నాడు నిండుగా. కిటికీ తలుపులువేసి విశాలమైన ఆకాశంలో మిణుకు మిణుకుమని వెలిగే నక్షత్రాలను చూశాడు.

గోపాలం కుమిలిపోయాడు. బాధతో హృదయం మూలిగింది తండ్రి పోయినపుడు కర్మలకోసం కాబూలీవాలా వద్ద చేసిన అప్పు... ఆరోజు... మానవరూపంలో వున్న దేవునిలా కనిపించాడు...ఈనాడు అదేమొడే తనను ... మృత్యుకింకరునిలా వెన్నాడు తున్నాడు. గోడమీద నాలుగవ తారీఖు తన ఖాళీజేబును చూచి నవ్వుతూంది వికృతంగా.

'అన్నం వడ్డించాను' లోపలనుండి శాంత కేక. దొడ్లో కాళ్లు కడుక్కుం టుంటే పిల్లలు ముగ్గురు అన్నాలు తింటున్నారు.

గోపాలం అన్నంవద్ద కూర్చున్నాడు రక్తం కలిపిన అన్నంలా కంట్రోలు బియ్యపు ప్రతిభ కనిపిస్తోంది. దూరంగా పొయ్యిలో కొరకంచులు ఆరిపేసినా యింకా అగ్ని చివరను వుండి రాజుకుంటున్నాయి. అన్యమనస్కుడై అన్నం కెలుకుతున్నాడు. ప్రతిరోజులా! 'యేమిటాలోచన... తినండి' శాంత మందలింపు ఆమె కళ్లల్లోకి చూశాడు. ఆమె కళ్లు మేఘాలు వర్షించ డానికి సిద్ధంగా వున్నాయి. కన్నీటితెర అడ్డంగా వుంది. బుద్ధిమంతుడులా, గోపాలం ముద్ద నోట్లోపెట్టుకున్నారు.

'నాన్నగారూ, నాకు మేడింటి వాళ్లమ్మాయి తొడుక్కున్న టెర్లిన్‌గౌను కుట్టిస్తానన్నారు!' పెద్దపిల్ల డిమాండు.

'నాన్నగారూ ... చిరిగిన బట్టల్తో వెళ్తే, బళ్లో హేళనచేస్తున్నారు...... యూనిఫారం లేకపోతే క్లాసుకి రావద్దంటు న్నారు. నాకు బట్టలు కుట్టించండి. లేకపోతే నేను వెళ్లను'అని రెండో అమ్మాయి రాధ.

'మరి నాకు సైకిలు తెస్తానన్నారు?' అంటూ అయిదేళ్ల కొడుకు ప్రశ్న. నిజమే! మేడింటి వాళ్లబ్బాయికి చిన్న సైకిలు వుంది. గుమ్మంలో నిలుచుని ఆ బాబు వరండాలో తొక్కుతూ వుంటే ఆశగా చూస్తాడు రాముడు. గోపాలం రెండు నెలల నుండి వాయిదా వేస్తున్నాడు. తీర్చ లేని వాడి కోరికను. గోపాలానికి అన్నం సహించలేదు. 'సైకిల్ లేకపోతే నేను అన్నం తినను' రాముడు దూరంగా కంచం త్రోసే శాడు అన్నం నేలమీదపడి చిందర వందర అయిపోయింది.

గోపాలం కోపం పట్టలేకపోయాడు. మరుక్షణంలో చంటివాడిమీద అయిదు వ్రేళ్లు చారలు తేలాయి. పెంకులు అంటే టట్టుగా రాముడు యేడుపు. మిగిలిన యిద్దరూ అన్నం వదిలేసి భీతావహులై తల్లివద్దకు చేరిపోయారు.

'చాల్లెండి మన అప్రయోజకత్వానికి పిల్లల్ని చంపటం' అంటూ పిల్లవాడ్ని ఎత్తుకుంది వాడి కన్నీటిని తుడుస్తూ. చీరకు వేసిన మాసిక తనను పరిహసిస్తున్న ట్లుగా తోచింది గోపాలానికి. రెచ్చిపోయాడు: 'ఇన్నాళ్లకు గుర్తించావు శాంతా! నే నప్ర యోజకుడ్నని' అన్నాడు బాధగా సగం తిన్న అన్నం ముందులేస్తూ.

'అన్నం తినకుండా లేవకండి...నన్ను చంపుకతిన్నంత వొట్టు...' శాంత కళ్లు నీరునిండి చెక్కిళ్లమీదగా జారి రాముడు తలమీద పడుతున్నాయి.

'మిమ్మల్నందరిని చంపుకుతింటున్నాను.. నేనొక్కడ్నే మిగిలిపోయాను' విసురుగా గది లోకి వెళ్లిపోయాడు యెదురుగా వస్తున్న ప్లీడరుగారి పెళ్లాన్ని తప్పించుకొని.

'ఒకనెల బకాయి పెడితే ఏదో బాగుంది. కానీ నాలుగునెలలా? యిదేంబాగులేదమ్మా... దీనికోసం కోర్టులకెక్కడం...' ప్లీడరు గారి పెళ్లాం వాగ్బాణాలు: యిలానైనా మొగుడికి కేసు దొరుకుతుందని ఆమె ఆశ.

'లేదు పిన్నిగారూ ... ఈ నెల యింకా జీతం రాలేదు. రాగానే కొంత సర్దుతాను.' అనునయంగా బ్రతిమాలుతోంది శాంత అంత దుఃఖంలోనూ!

ఏడుపొచ్చింది గోపాలానికి!

'భగవాన్! దరిద్రమంత ప్రత్యక్ష మృత్యువు జీవితంలో మరేది లేదా'! పిరికి వాడైపోయాడు; గోపాలం.

ఈ వాతావరణంనుండి యెప్పుడు బయట పడదామా, అన్న తొందరలో చిరిగిన చొక్కాను మరింత చింపుతున్నాడు. చిరుగును కనబడకుండ తువ్వాలు వేసుకొని, అరిగిన చెప్పులు తొడుక్కొని బీచ్‌వైపు మనస్సు పరిగెడితే, దొంగలా చూపులు చూస్తూ అప్పులు వాళ్లను తప్పించు కుంటూ నడిచాడు.

సముద్రపు కెరటాల్లా ఆలోచనలు! నీరసంగా యిసకలో కూర్చున్నాడు గోపాలం. వద్దనుకున్నా గతం వెంబడిస్తునే వుంది. బ్రతుకులో అందం, ఆనందం యిలా వుంటుందని తెలియదు. ముప్ఫైయేళ్ల జీవితంలో ప్రతిక్షణం నరకప్రాయం అయి పోయింది.

తాను స్కూలుఫైనలు ప్యాసవగానే తండ్రి పక్షవాతం వచ్చి పడిపోయాడు. తన తల్లి చిన్నప్పుడే చనిపోయింది. జీవనాధారంకోసం తప్పనిసరిగా వుద్యోగం వెతుక్కోవలసి వచ్చింది. 'ఎలక్ట్రిసిటీ' డిపార్టుమెంటులో గుమాస్తా. ఇంటి దక్షతకు తండ్రి పరిచర్యలకు తప్పనిసరిగా పెండ్లి చేసుకోవలసి వచ్చింది.

వచ్చే జీతంలో చాలా భాగం తండ్రి మందులకు ఖర్చయ్యేది. యేనాడు గోపాలంలో విసుగుదల కనిపించలేదు జన్మనిచ్చినవాడు తండ్రి. కొడుకుగా కనీసం ధర్మాన్ని నిర్వర్తించాలి. అప్పుడు తన బ్రతుక్కి సార్థకత యేర్పడుతుంది. ఎప్పుడూ తన జీవితం యంత్రంలా పనిచేసింది

# వ నసం బ్రతకాలి

అందమై, స్నిగ్ధమై, ముగ్ధ మనోహరమైన శాంత సౌందర్యం, నల్లటి మేఘాలు అందమైన చంద్రుణ్ని కప్పుతున్నట్లుగా, ఆమె తలంటుకున్నప్పుడు, అందమైన ముంగురులు నుదుటిమీద పడటం, యిలాంటివేవి తనను ప్రభావితం చేయలేకపోయాయి.

దైనందిన సమస్యలవలయంలో కర్తవ్యం కోసం తనతండ్రి జీవితంకోసం, తనజీవితం ఒక దారుణమైన మలుపుతిరిగి పోయినా, తండ్రిని దక్కించుకోలేక పోయాడు.

ఆ దారుణమైన మలుపు తిరగకముందు అరసవిల్లి సూర్యనారాయణస్వామి కోవెల, సూర్యగుండం, మామిడితోటలు, కోయిల కూతలు, దేవాలయములో తనూ, కమల స్వామి తీర్థం పుచ్చుకోవటం, తనవేపు చిత్రంగా నవ్వుతూ కమల జడలో మందార పూవు ముడుచుకోవటం; దుర్గ దగ్గర కుంకుమబొట్టు, శివాలయంలో తాబేళ్లకు అరటిపళ్లు తినిపించటం.... యింకా.... యింకా ఆ సంఘటన యింకా జ్ఞాపకము ...తన కళ్లముందు ఇప్పటికీ పరిభ్రమిస్తున్నాయి.

క్షీరాబ్ధిద్వాదశి, స్వామి తెప్పతిరునాళ్లు....తరుగుతున్న సాయం సమయంలో అరటిదొనెల్లో దీపాలు వెలిగించి సూర్యగుండంలో వదులుతారు. దూరంగావున్న రేవులో తాను కూర్చుంటే...పంగపండు ధర్మవరం పట్టు పరికిణీతో తెల్లని పట్టు జాకెట్టుమీద నీలిపువ్వులతో రాగ రంజితమైన పెదవులతో నీటివద్దకు లాక్కుపోయింది కమల. కమలాపండు డొల్లల్లో ఆవునేతి గుమగుమలతో దీపాలు అమర్చింది. యిద్దరూ కలిసి ఒకేసారి వొదిలారు దీపాలు.

'కళ్లుమూసుకొని దేవుడ్ని ప్రార్థించు' కమలవంక తను చూస్తుంటే కమల మందలింపు. ఆజ్ఞ పాలించటం తన కర్తవ్యమయింది.

'కమలా...అందరూ అక్కడ దీపాలు వెలిగిస్తుండగా యిక్కడెందుకూ?' తన ప్రశ్న, అమాయకంగా. కమల నవ్వింది. అక్కడ మనదీపాలు అందరిలోను కలసిపోతాయి. మనదీపాలు గుర్తించుకోము. ఇక్కడచూడు, మనదీపాలు యెలా రెండూ ప్రయాణిస్తున్నాయో!' అంది మెరిసే కళ్లతో!

'ఎక్కడికి ప్రయాణం కమ్మీ!'

'ఈ మాత్రం తెలియదా బావా! మనలో అంతర్గతమైన కోర్కెలు, చీకటిలాంటి జీవితంలో దీపాలు వెలిగించి మా జీవితాలను కాంతివంతంచేసి, వెలిగించిన దీపాలను గమ్యస్థానము చేర్చు ప్రభూ! అని దీపాలు దేవుడికి నివేదిస్తాయి.' అంది ఆరిందాలాగా. ఆ కోర్కెల దీపాలు వెలిగించి, ఆవెలుగుబాటలో తన జీవితాన్ని నడిపించలేక పోయింది. అంతస్తుల మేడలో ఆస్తిపరుల హోదాల్లో, నివసించే, మూగవోయిన కమల, వాళ్ల తల్లిదండ్రుల ఆశల, ఆశయాలు కమలకు వుజ్వలమైన భవిష్యత్తు యేర్పడాలన్న తపన, తన బంధుత్వపు మమతలని, చిన్ననాటి మధురమైన, స్నేహాన్ని, ప్రేమను, అభిమానాన్ని దారుణంగా వేటాడాయి. తను జీవితంలో పతనం కాకపోయినా, పరాజితుడయ్యాడు. క్రొవ్వొత్తిలా కరిగిపోతున్న కాలంలో!...

మళ్లీ రానేవచ్చింది తెప్పతిరునాళ్లు. చిన్నతుంపర అకాశంమీదనుండి. ఓడినవ్యక్తి పూర్వపు వైభవాన్ని గుర్తుకు తెచ్చుకున్నట్లున్నాడు, తను గట్టుమీదకూర్చుని. కరుగుచున్న సాయం సంధ్యలో కమల వచ్చింది.

కనకాంబరం రంగు పట్టుచీరలో నీలి అంచుగల తెల్లని పట్టు జాకెట్టుమీద చిన్నచిన్న పువ్వులతో సంపెంగలు, సన్నజాజులు, తురుముకున్న వాలు జడతో కాంతి నింపుకొన్న కండ్లతో దీపాన్ని వెలిగించింది, కమలా పండ్లడొల్లల్లో!

నీటిలోకి వదులుతోంది!

'ఆగు...కమలా! నేను వస్తున్నా! దీపం వెలిగిద్దాం. ఇద్దరంకలిసి వదులుదాం!' అని గట్టిగా అరవాలనిపించింది తనకి. పసుపు పచ్చని సూత్రంతో కూర్చబడ్డ క్రొత్త మంగళసూత్రాలలో ఆదీపకాంతి ప్రతిబింబించి వూగుతోంది. తను అర్హుడుకాదు. 'కమల' ఎందుకో కళ్లు తుడుచుకుంది. బహుశా తనకోసమేమో!

'భగవాన్! మంగళ ప్రదమైన జీవితం భవిష్యత్తులో ఆమెకు ప్రసాదించు! అని ప్రార్థించి కన్నీటితెర అదృశ్యాన్ని మస

# సర్వ
# తోముఖ
# సౌందర్యపోషణ-

ఎప్పుడైనా-
ఎక్కడైనా-

క్రూక్స్ లాక్టో కేలమైన్
'ఫౌండేషన్' చేయవలసినంతగా
మచ్చలను మరుగు పఱచి చర్మము
నకు పట్టువంటి మృదుత్వమును
చేకూర్చును. గాన క్రూక్స్ లాక్టో
కేలమైన్‌ను 'ఫౌండేషన్'గా వాడండి.

క్రూక్స్‌లాక్టో కేలమైన్ యింకను పలువిధ
ములుగ వినియోగ పడును. క్రూక్స్
లాక్టో కేలమైన్ లోని ,కేలమైన్,'
'విచ్‌హేజల్' మీ చర్మమును శుభ్రపఱచి
తగినంత తేమనిచ్చుచు మృదువుగ
నుంచుటయే గాక సున్నితమైన పోషణ
నిచ్చును. ఇంతేగాక లాక్టో కేలమైన్
అన్ని కాలములందును, రాత్రింబగళ్ళు
ఉపయోగించ దగిన 'మేకప్'

క్రూక్స్ లాక్టోకేలమైన్ వాడునపుడు
కృత్రిమ మైన మేకప్ అవసరము లేదు.

## క్రూక్స్
# లాక్టో-కేలమైన్

కళంకరహిత సౌందర్యానికి




క్రూక్స్ ఇంటర్‌ఫ్రాన్ లిమిటెడ్
బొంబాయి — 25

CH. II-TEL

చిన్న సైజులో కూడా యిప్పుడు లభిస్తుంది

కిగా చేస్తుంటె వచ్చేశాడు తను.!

డాల్ఫిన్సు నోసమీద పెర్చిలైటు చీకటి జీవితంలో ఆశాకిరణంలా చుట్టూ తిరుగుతోంది. వెలుగుపడిన కెరటాలు వెండిలా కన్పిస్తున్నాయి.

తన భవిష్యత్తు తనకోసం యేం దాచి పెట్టింది! ఆ అనుభవాలను, ఆశలను, తియ్యటి కలలులా భద్రపరచుకోమంది! యింకేం దాచిపెట్టింది తనకోసం!... దరిద్రం, లేమితనం, అప్పులు, ఆశలతో బ్రతికేపెళ్ళాం, పిల్లలు...చాలీచాలనిజీతాలు ...శుష్కించి పోయిన కండ్లతో వదనంలో ద్యోతకమయే నిరాశ, ఆకలి కడుపుతో మాడే మనస్సు...యిదా ? అన్ని జన్మలలో కెల్లా, వుత్కృష్టమయిన పవిత్రమయిన, మానవజన్మ తనకు ప్రసాదించింది. చల్లని యిసుకలో, గోపాలం శరీరం వేడెక్కిపోయింది. యెదురుగా విశాలమైన సముద్రం స్వాగతమిస్తోంది.

చివరసారి, శాంతను, పిల్లలనూ, చూడాలన్న కోరిక కలిగింది. ఇంటిగుమ్మం యెక్కేసరికి మేడింటివద్ద కార్లు ఆగాయి. అందులో పెద్ద మనుష్యులు, జరీ ఖండువాలు, చిరునవ్వులు వొలకబోసుకుంటూ ఆఫీసరుగారివద్ద శెలవు తీసుకొంటున్నారు. మేడమీద కాంతితో నీడల కదలికల నవ్వులు. తను వస్తానని శాంత తలుపు దగ్గరగా వేసుంటుంది, తలుపు తెరిచాడు.

ట్రాన్స్‌ఫార్మర్ బల్బు వెలుగుతో శాంతా...పిల్లలు...రాముడు అంతా చిరిగిన బొంతమీద పడుకున్నారు. శాంత నుదుట మీద కుంకుమ చెమ్కీ, విచిత్రంగా మెరుస్తున్నాది. ఆ చిన్నకాంతిలో, యశోధరలా వుంది శాంత.

సిద్ధార్థుడు జ్ఞాపకం వచ్చాడు. సర్వ రాజ్యభోగాలను, భార్యా పుత్రులను విడిచి, జీవన పరమార్థం కోసం, సత్యం కోసం ఆరాటపడి పయినించాడు. మరితనో? గోపాలం నవ్వుకున్నాడు. జీవితానికి చిలుములా పట్టుకున్న దారిద్ర్యాన్ని విసర్జించి, కన్నుల కాంతులీనే భార్యాబిడ్డలను వారి ఖర్మానికి వదిలేసి, జీవితపు సరిహద్దులను దాటిపోతాడు కొద్దిక్షణాల్లో.

యేమిటో! యెక్కడా ఆలోచనకూ, మనస్సుకూ, రాజీ కుదరటంలేదు.

'పిరికివాడా! ఆత్మహత్య చేసుకుంటావా'? అన్నట్టు తండ్రిఫోటో నవ్వినట్లుగా భ్రాంతి, గుడ్డి వెలుతురులో. 'లేదునాన్నా,

# మనసు బ్రతకాలి

నేను ధైర్యవంతుడ్ని. అందువలనే యీ నిశ్చయానికి వచ్చాను.' అనుకున్నాడుబాధగా!

తండ్రి వాడే నల్లమందు డబ్బిలో మిగిలిన నల్లమందు అరచేతిలో వేసుకొని, నూనె తెచ్చుకొని కలుపుకున్నాడు గోపాలం.

తన జీవితం ఆఖరి గడియలు ప్రవేశిస్తున్నాయి. తన తల్లితండ్రులు స్వర్గంలో వున్నారో నరకంలో వున్నారో తెలియదు.

కాబూలీవాలా, ఇంటద్దెకోసం ప్లీడరుగారు...పాలవాడు...కిరాణా సామాన్ల శెట్టిగారు...చిల్లర అప్పుదారులు...వీళ్ళంతా రేపు తనకోసం ఏం చేస్తారో!...యింకా... శాంత...అమ్మలు...రాముడు... రాధ...అరసవిల్లిసూర్యనారాయణస్వామి...సూర్యగుండం మామిడిచెట్లు...బొగడ పువ్వులు... తెప్పతిరునాళ్ళ, తిరునాళ్ళలో దీపాలు ... వూగుతూ, ఆగుతూ నడచే కాంతిపుంజాలు. ఆ దీపాల కాంతిలో రాగరంజితమైన పెదవులు వదనంతో కమల...తమ సాధించేది యేదీ లేదు. చచ్చి వుద్ధరించేది యేదీ లేదు.

చరిత్రలేని జీవితం చెదలుపట్టడం కన్నా, చావును శరణు వేడటమే మంచిది. ఈ బాధలు వేదన మరణంతో అంతమొందుతాయి. వెలుగులో తప్పుచేయలేడు తను! ట్రాన్సుఫార్మరు ఆర్పేశాడు. నూనె కలిపిన నల్లమందు త్రాగబోయే సమయంలో!

పిడుగులు పడ్డట్టూ! హఠాత్తుగా, అంత నిశ్శబ్దంలోనూ యెదురింటిలోను, యేడుపులు, పెడబొబ్బలు వినిపించాయి.

రోడ్డునిండా పోలీసుజీపులు...వేనులు.




"నాన్నగారూ మమ్మల్ని విడిచి వెళ్ళిపోతున్నారా?' 'ఏమండోయ్ నన్ను అన్యాయంచేసి పోయారా!' 'బాబూ...మాకేమిటి గతి!' గోలగగ్గోలు! అందరూ మూగుతున్నారు. హేండ్‌కప్పు పట్టుకొని సర్కిల్ ఇన్స్‌పెక్టరు బయటకు వచ్చేస్తున్నాడు విచారంతో. క్షణంలో పరిస్థితి అర్థమయింది గోపాలానికి.

త్రుళ్ళిపడ్డాడు గోపాలం పీడకల నుండి తేరుకున్నట్టుగా చెయ్యి వణికి వేళ్ళసందుల నుండి గరళం జారిపోయింది, నేలకొరిగిన అవినీతిలా.

ఆఫీసరుగారి శవాన్ని వరండాలోనికి తెస్తున్నారు. ఆ దృశ్యం చూసి గోపాలం కెవ్వున కేకవేసి పడిపోయాడు.

తెలివి వచ్చేసరికి గదిలో లైటు వెలుగుతోంది. తను మంచం మీద వున్నాడు. శాంతవడిలో తన తలకు తగిలిన గాయానికి శాంత కట్టు కడుతోంది. అమ్మలు గ్లాసుతో వంటింట్లోంచి వస్తున్నది. మిగిలిన పిల్లలు తనవద్దనే కూర్చునియున్నారు.

'హార్లిక్సు', తీసుకోండి,'' అంది శాంత. మృదువుగా వద్దని తలూపాడు గోపాలం.

'నీరసంగా వున్నారు. తీసుకోండి' బ్రతిమాలుతోంది స్నేహితురాలుగా! శాంత.

అగ్నిసాక్షిగా ప్రమాణంచేసి పెళ్ళిచేసుకున్న శాంత జీవితంలో, సహధర్మచారిణిగా, సమభాగినిగా అర్ధశరీరం పంచుకున్న శాంత వేదన అద్దంలా కనిపిస్తోంది.

రాముడు—రాధ—అమ్మలు—దిగులుగా చూస్తున్నారు తనని. రాముడ్ని దగ్గరగా తీసుకున్నాడు గోపాలం. ఒక్కక్షణం ఆలస్యమైతే తన, పిల్లలు అనాథలవవలసింది.

వారి, బంగారంలాంటి భవిష్యత్తుయివన్నీ రంగులరాట్నంలాతిరిగాయి. శాంత చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు గోపాలం. 'శాంతా ... బాబూ ... రాధా... అమ్మలూ ... మిమ్మల్ని ...' అరచేతో గోపాలం పెదాల్ని మృదువుగా మూసింది. సజల నయనాలతో క్షమిస్తున్నా నన్నట్లుగా శాంత.

నాకు జీవితంకావాలి... నేను బ్రతకాలి... నా మనస్సు బ్రతకాలి ... అనుకున్నాడు హృదయంలో. వరండాలో, చీకటిమింగిన ఉషస్సులో గోపాలం కన్నీటితెర కరిగిపోయింది. ●

వి. ఎన్. వెంకటరత్నం, మిట్టపల్లి

ప్ర: నటీ, నటులు సినీ జీవితంలోలాగా నిజజీవితంలో నటిస్తారండీ ?

జ: మీరు సినిమాలు చూచి, అందులోలాగే మీరూ ప్రవర్తిస్తారండీ?

పి. మల్లిక్, విశాఖపట్నం

ప్ర: మీరు యెప్పుడు హీరోలతోకన్నా విలన్‌తో యెక్కువగా నటిస్తూయుంటారు. కారణం?

జ: విలన్ లేనిదే హీరొయిజమ్‌కు ఛాన్సులేదు కాబట్టి.

పిరుగులిఖ కోటేశ్వరావు, తెనాలి

ప్ర: మీ సినిమా జీవితంలో యెప్పుడయినా, యెప్పటికయినా, ఏదయినా కోరిక సాధించాలని వుందా ?

జ: ఒకే ఒక కోరిక, హీరోయిన్ వేషాలువేసి మీచే సెభాష్ అనిపించుకోవడమే.

ఎన్ నాగభూషణరావు, విజయనగరం

ప్ర: ఏ కారణం చేతనయినా మీ యాక్టర్లంతా కలిసి సమ్మెచేస్తే మాగతి?

జ: ముందు మాగతి ఆలోచించండి; అప్పైన కదా మీ పరిస్థితి.

ఎస్. వి. బి. కృష్ణారావు, కొత్తగూడెం

ప్ర: సెక్సు అంటే ఏమిటో చెబుతారా?

జ: మిమ్మల్ని మైమరపించే దివ్యసాధనం.

కమలాకర పుష్పశ్రీ, గుంటకల్

ప్ర: చిన్నపిల్లల ముద్దులకు, పెద్దవారి ముద్దులకు గల తేడా యేమిటో విపులంగా తెలియపరుస్తారని నా ఆశ?

జ: చిన్నపిల్లల ముద్దులో మురిపెం వుంటుంది; పెద్దవారి ముద్దులను 'వద్దు వద్దు' అంటుంది — యిదే వ్యత్యాసం.

విజయ లలిత ******



*** వేషాలు

వసుపులేటి రామారావు, ఉండ్రాజవరం

ప్ర: మాలో సుడిగుండాలను చూపిన మీరు, మీలో సుడిగుండాలను యెందుకు నిర్మూలించకోరు ?

జ: మీలో సుడిగుండాలను చూపానో, అగ్నిగుండాల్ని యేర్పరచానో, లేక అమృత భాండాన్ని లేవదీసానో అది మీకే తెలియాలి; మీరు తెలుసుకున్న తర్వాత నాలో యేముందో నిర్ణయించి మీరే నిర్మూలించడానికి ప్రయత్నించండి.

బి. రవీంద్రరావు, కాకినాడ

ప్ర: మీరు యిచ్చే జవాబుల్లో వేదాంతం కన్పిస్తూంది. ఏమయినా ఫిలాసఫీ చదివారా?

జ: మన వుదేంతంతారా వేదాంతం లోనే యిమిడివుంది సోదరా!

ఎం. ఎస్. శంకరరావు, గుంటూరు

ప్ర: మీకు దేవుని మీద నమ్మకం వుందా?

జ: మీకు మీ మీద నమ్మకం వుందా; మీ మాటమీద నమ్మకం వుందా చెప్పండి.

పి. వి. కె. చౌదరి, వైజాగ్

ప్ర: మిమ్మల్ని సినిమాల్లో చూడగానే ఏదోలా వుంటుందండీ. మళ్లీ మళ్లీ చూడాలనిపించేదానికి కారణం?

జ: మీ ప్రశ్నల్ని మరీ మరీ చదవాలనిపిస్తుందండీ; మళ్లీ మళ్లీ వెయ్యాలనిపిస్తుంది—దీనికి కారణం?

బహుమతి పొందిన ప్రశ్న

బరంపురంనుండి ఒక సోదరుడు

ప్ర: మీకు 'ఉత్తమ సెక్సీతార' బహుమతి యివ్వాలంటాను. మీరేమంటారు ?




జ: నిరభ్యంతరంగా పుచ్చుకుంటాను; అది నాకు మీ రిచ్చే ప్రత్యేక గౌరవంగా భావిస్తాను.

# జాక్‌పాట్ కొట్టిన పత్రికా రచయిత!



మోహన్‌కుమార్

'నా సొంత టిక్కెట్టు పాసయివుంటే —'జాక్‌పాట్ ప్రొడక్షన్స్' బ్యానర్‌మీద చిత్ర నిర్మాణంలోకి వురికి వుండేవాడిని' అన్నాడు గిండీరేసుల్లో జాక్‌పాట్ కొట్టిన మోహన్ కుమార్. ఈ మోహన్‌కుమార్ ఎవరనుకుంటున్నారు? సాక్షాత్తూ మన ఆంధ్ర సచిత్ర వారపత్రిక 'చిత్రలహరి' మోహన్‌కుమారే! స్వస్థలం రాజమండ్రి తాలూకాలోని తొర్రేడు.

'అంతా తమాషాగా జరిగిపోయింది. అన్ని ఆశలూ వదిలేసుకుని జేబులు తడువుకున్నాను. ఒక్క రూపాయుంది. సరే, ఎలక్ట్రిక్ ట్రయినులో పోవచ్చులే అనుకున్నాను. మరి కాస్సేపటిలో అదృష్టం వరించేసింది. లక్ష రూపాయిలు చేతులో పడ్డాయి. అంతా అదృష్టమనుకోండి. అంతే! లెక్కలువేసి దస్తాలకి దస్తాలు కాయితాలు ఖరాబు చేసినవాళ్ళున్నారు. ఏమీ లేకుండానే మాకొచ్చింది. అదృష్టం కాదంటారా?' అన్నాడు మోహన్‌కుమార్ తన అదృష్టానికి మురిసిపోతూ.

'నా జీవితంలో చరిత్రాత్మకమైన రోజు డిసెంబరు ఫస్టు. ఇదొక రకంగా నా జీవితానికి టర్నింగ్ పాయింట్.' అన్నాడు ధైర్యం చిక్కిన వాడిలా.

మోహన్ కుమార్‌కి రేసులకి వెళ్ళడం కొత్తేమీ కాదు. ఇదివరకు బెంగుళూరులో రు 600 పోగొట్టుకుని రు. 138 గెల్చుకున్నాడు! అంత క్రితం వారం గిండీలోనే ఒక 'లెగ్' తేడాతో జాక్‌పాట్ పోగొట్టుకున్నాడు.—ఇది అతని రేసుల అనుభవం.

జాక్‌పాట్ టిక్కెట్‌కోసం చాలా అవస్థపడాల్సి వచ్చిందట. 23 కౌంటర్లూ ఎంతో తొడతొక్కిడిగా వున్నాయట. అందరిలోనుంచి దూరి టిక్కెట్టు తీసుకునే ప్రయత్నంలో వాచీ తెగిపోయిందట. వేలి వుంగరం జారి క్రింద పడిపోయిందట. వళ్ళంతా హూనమయి పోయిందట.

'రెండు సిమెంటు బస్తాలు వెనకా ముందూ కట్టినంతగా బాధపడ్డాను' అన్నాడు టిక్కెట్లకోసం తానెలా ప్రయత్నించిందీ వివరిస్తూ.

3, 3, 5, 7, 9 జాక్‌పాట్ 'ఫైవ్ లెగ్స్'. త్రీలెగ్స్ వరసగా వచ్చాయి. మోహన్ కుమార్ జ్ఞాపకముంచుకోడానికి ఒకోసారి ఒకో కమలాపండు కొనుక్కుని అట్టే పెట్టుకున్నాడు. ఫోర్త్ లెగ్‌లో తనదగ్గర '8' వుంది. ఆ గుర్రంమీద అనుమానం తోచి సిండికేట్‌కోసం ప్రయత్నించాడు. ఎనిమిదిని వెతుక్కుంటున్న 'ఏడు' వ్యక్తి తటస్థపడ్డాడు. అంతే ఒప్పందం కుదిరిపోయింది. మొత్తం జాక్‌పాట్ 14 లక్షల సుమారు ఏడు టిక్కెట్లు పాసయ్యాయి అందులో వీరి దొకటి. 2,04 369 రూపాయల్ని ఇద్దరూ పంచుకున్నారు. స్వార్థం చూసుకుంటే మోహన్‌కుమార్ లక్షాధికారి అయివుండేవాడు!

ఆరోజు రేసులకు వెళ్ళడం విషయం చెబుతున్నప్పుడు మోహన్‌కుమార్‌ని అదృష్టం వరించి వచ్చిందనే అనిపిస్తుంది.

కథానాయకుడు చిత్రాన్ని నిర్మిస్తున్న గోపాలకృష్ణ ప్రొడక్షన్స్ ఆఫీసులో మోహన్‌కుమార్, ప్రొడ్యూసరు గోపాలకృష్ణ, డైరెక్టరు హేమాంబరధరరావు కూర్చున్నారట. ఆఫీసుకు ఫోన్‌కాల్ వచ్చింది. ప్రొడక్షన్ మేనేజరు ఫోన్‌లో ఎవరితోనో 'డబ్బుకయితే వచ్చేవారం ఫోన్ చెయ్యమ'ని చెబుతున్నాడట. మోహన్‌కుమార్ లేస్తూ 'రేసులకి వెళ్తున్నా' అన్నాడు. 'అయితే మాదీ కలపండి' అని డైరెక్టరూ, ప్రొడ్యూసరూ కలిసి యాభై రూపాయిలిచ్చారట. మొత్తం డెబ్భయ్ రూపాయలతో బయలుదేరుతూ—

'డబ్బు తీసుకువస్తాను ఇక్కడే వుండండి' అన్నాడట. చెప్పినట్టుగానే జేబురుమాల్లో కట్టిన వంద, పదినోట్ల కట్టలు వారి ముందు టేబుల్‌మీద పడేశాడట. మొదట్లో వాళ్ళు నమ్మలేదు. తర్వాత ఆనందాశ్చర్యాలలో మునిగిపోయారు!

జాక్‌పాట్ కొట్టినప్పుడు తనకేమీ అనుభూతి కలగలేదన్నాడు. పైగా ఎంతో అస్వస్థతగా ఫీలయ్యాడట. కనీసం నాలుగు లక్షలు ఆశించిన వ్యక్తికి ఒక లక్ష వచ్చినప్పుడు ఆవిధమైన చిరాకు, విసుగు సహజమే కావొచ్చు!

ముందేం చేస్తారని నేనడిగినప్పుడు 'జర్నలిజం నా వృత్తి. నా వృత్తిని నేను గౌరవిస్తాను. దానిని ఎప్పుడూ విడిచిపెట్టను. ఎన్ని లక్షలొచ్చినా సరే. ఈ డబ్బును ఎలా వినియోగించుకోవాలన్న విషయం మాత్రం ఇంకా నిర్ణయించుకోలేదు' అన్నాడు. వృత్తిమీద అతనికున్న విశ్వాసం ఎంతయినా ప్రశంసించదగింది.

రేస్ కోర్సులో 'సిండికేట్' అవడమూ, వచ్చినదాన్ని భాగస్తులకు పంచడమూ కేవలం మాట నమ్మకంమీద, నిజాయతీమీద ఆధారపడిన విషయాలు. లక్ష రూపాయాలు నోట్లకట్టలు చేతులో వుంచుకుని స్వార్థం చూసుకోలేదు 'వాటిమీద ఆశ పెట్టుకోని' భాగస్థులకి పంచాడు మన మోహన్ కుమార్. అతన్ని అభినందిస్తున్నాము.

—సికరాజు.

### ప్రేమపాశాల్లో ముగిసిన పోట్లాట

తాతినేనితో సంభాషణ ముగించి సెట్టు బయటకి వచ్చేసరికి 'సత్తెకాలపు సత్తెయ్య' నిర్మాత ప్రసాద్ 'కారు యెక్కవయ్యా' అని నన్ను గోకులం కాలనీలోగల వాళ్ల ఆఫీసుకి తీసికెళ్లాడు; ఆఫీసులో యెదురెదురుగా కూర్చున్నాం; ఆగర్భ శ్రీమంతుడు ప్రసాద్; డబ్బును లక్ష్యపెట్టక తన చిత్రానికి యెవరు యేం కోరినా చేసి పెట్టాడు; యెప్పుడో విడుదల కావలసిన చిత్రం యింకా బయటపడలేదు; 'సంపద వుంటే సరా మనశ్శాంతి లేకపోతే యెలా' అని వాపోయాడు ప్రసాద్. నిజమేగా అంటూ మీ పిక్చర్ విశేషాలేమయినా వుంటే చెప్పండి అన్నాను. నా పిక్చరులోని ఒక సన్నివేశాన్ని మీకు చెప్తాను; దాన్ని మీరు పాఠకులకు తెల్పండి అన్నాడు; ప్రసాద్ మీకు తెల్పమన్న కథాంశాలన్ని సావధానంగా చదవండి.

ఈ చిత్రంలో చలం అన్నెం పున్నెం యెరుగని అమాయకుడు; నా అన్నవాళ్లు యెవ్వరూ లేని అనామకుడు; ఉదర పోషణార్థమై ఆ వూర్లో క్యారియర్లు మోసి బ్రతుకుతున్నవాడు; నేటి మాయా జగత్తుయొక్క ధర్మాన్ని చవిచూడని వాడు. అతనికి పోటీగా విజయలలిత కూడ క్యారియర్లు మోసుకుంటూ పొట్ట పోసుకుంటుంది. వీళ్లిద్దరి కీచులాట ప్రేమ పాశాల్లో ముగుస్తుంది; చలం యొక్క మంచితనం శోభన్‌బాబును ఆకర్షిస్తుంది; రాజశ్రీకి అభిమాన పాత్రుడౌతాడు చలం. ఒకరోజు ఆమె వెయ్యిరూపాయలు యిస్తుంది. దారిలో డబ్బుపోతుంది; అంత డబ్బును యెలా తిరిగి యివ్వడం? ఒట్టి చేతులతో ఆమె ముఖం యెలా చూడడం అని వాపోతాడు చలం. ఇంత వరకు నేను చెప్పాను; మిగతాది మీరే ఆలోచించుకోండి; డబ్బును పోగొట్టుకున్న చలం యేం చేస్తాడు? పోయినడబ్బు దొరికిందా? నేటి సంఘంలో బ్రతక నేర్చుకున్నాడా? లేక సత్యాన్ని జీవితాంతం నమ్ముకున్నాడా? అన్న ప్రశ్నలకు 'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రం చూడండి. చిత్రంలో చలం ధరించిన పాత్రకు నిజ జీవితంలో ప్రసాద్‌కు జరుగుతున్న సంఘటనలకు సామ్యం వుందని

# సినిమా

పిస్తుంది. కె. బాలచందర్ దర్శకత్వంలో తయారయిన యీ సాంఘిక చిత్రంలో ఎం. ఎస్. విశ్వనాథం సమకూర్చిన సంగీతం మీ నోట ప్రతిరోజు మీ అలవాట్లలో ఒక దాన్నిగాచేసి తీరుతుంది. రాజశ్రీ, శోభన్, విజయలలిత, గుమ్మడి, ఎన్ వరలక్ష్మి, రావికొండలరావు ముఖ్యపాత్రలను ధరించిన యీ చిత్రం జనవరి పండుగ సమయాల్లో పూర్ణాపిక్చర్స్ ద్వారా విడుదలౌతుంది.

### తప్పిపోయిన గండం

నాగభూషణం, గుమ్మడి, రుక్మిణి డైనింగు టేబిలుదగ్గర కూర్చుంటూ, జమున రాక కోసం యెదురు చూస్తుంటారు. అంతలో జమున గెంతుకుంటూ వస్తుంది.

జమున: (నాగభూషణం, గుమ్మడిని చూస్తూ) డాడీ! మావయ్యా!

నాగభూషణం: ఏమిటమ్మా, యింత ఆలస్యం.

జమున: డాడీ, యివ్వాళ నాకు ఎంత పెద్ద గండం తప్పిందో తెలుసా?

నాగభూషణం: గండమా! ఏమయిందమ్మా! ఏమయింది?

జమున: జాగ్రత్తగా వినండి! ఇక్కడి నుంచి నేను గుర్రంమీద బయల్దేరానా! గుర్రం అలా గుట్టల్లో, కొండల్లో సాగి పోతోంది—టక్, టక్, టక్, టక్.....

నాగ: ఏమిటది!

జమున: ఓహ్! గుర్రపుడెక్కల సౌండు డాడీ! నేను మైమరచి ప్రకృతిని చూస్తూ మెల్లిగా, చల్లగా వెళ్తున్నాను, (తన్మయత్వం అభినయిస్తూ) ఇంతలో గుర్రంమెళ్లో ఒకతాడొచ్చి బిగిసిపోయింది —డడంగ్ (నాగభూషణం వులిక్కిపడ్డాడు) నేను దభేలుమని కిందపడ్డాను. డిడింగ్! హ్హా! హ్హా! హ్హా! ఒక విలన్ దొంగొచ్చాడు— నా చెయ్యి పట్టుకొన్నాడు— దగ్గరకు లాగాడు. (అని తన తండ్రి చెయ్యిపట్టుకుని) ఇంతలోకి టాం టటాయ్!

నాగ: అదేమిటి! మళ్లీ వీడెవడు?

జమున: కథానాయకుడు డాడీ! ఒక టార్జాన్ వచ్చాడు! విలన్ దొంగను పట్టుకున్నాడు. నాన్‌సెన్సు— గోనిసంచి— ఒక

## సినిమా డైరీ

● జగపతి పిక్చర్స్ నిర్మించిన "అదృష్టవంతులు" చిత్రంలో క్లయిమాక్సు బ్రహ్మాండంగా వుందని యిటీవల రష్ చూసినవాళ్లు చెప్పారు. బాక్సాఫీస్ దర్శకుడు వి. మధుసూదనరావు దర్శకత్వంలో నాగేశ్వరరావు, జయలలిత, జగ్గయ్య, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, విజయలలిత, పద్మనాభం గీతాంజలి, భీమరాజు, ఆనందమోహన్, బేబిరాణి చక్కటి నటనను ప్రదర్శించారట. ఈ చిత్రాన్ని రాజేంద్రప్రసాద్ నిర్మించాడు.

● మాధవి పిక్చర్స్ "బందిపోటు దొంగలు" చిత్రానికిగాను కె. ఎస్. ప్రకాశరావు క్లయిమాక్సు ఫయిట్‌ను హైదరాబాదు సమీపంలో చిత్రీకరించారు. నాగేశ్వరరావు, ప్రభాకరరెడ్డి ఒక ప్రక్క, జగ్గయ్య, రంగారావు బృందం మరొక ప్రక్క ఫయిట్‌లో పాల్గొన్నారు. ఈ చిత్రంలో జమున కాంచన కథా నాయికలుగా నటించారు. మరొక ముఖ్య పాత్రను గుమ్మడి ధరించాడు.

● గౌరి ఆర్ట్సు పిక్చర్స్ "దేవుడిచ్చిన భర్త" షూటింగు ఈ వారంలో పూర్తయింది. పాలగుమ్మి పద్మరాజు దర్శకత్వం వహించిన యీ చిత్రంలో రాజశ్రీ, కాంతారావు, రాజనాల, సత్యనారాయణ జయంతి, మిక్కిలినేని, రాజబాబు, విజయలలిత ముఖ్యపాత్రధారులు.

● తాతినేని చలపతిరావు సంగీత దర్శకత్వంలో బాలసుబ్రహ్మణ్యం పాడిన ఒక పాటను "చిరంజీవులు"' చిత్రానికిగాను ఆరుణాచలం స్టుడియోలో జీవా రికార్డు చేసారు. ఈ చిత్రానికి సావిత్రి గణేశ్ దర్శకురాలు.

● ప్రముఖ తమిళనటుడు శ్రీ యమ్. జి. రామచంద్రన్ సోదరుడు యమ్. జి. చక్రపాణి కుమార్తె చి. సౌ. విజయలక్ష్మికి చి. పి. కె. వేణుగోపాలన్‌కి మద్రాసు యస్. డి. యస్. కళా మండపంలో వైభవంగా వివాహం జరిగింది. మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురై స్వయంగా వచ్చి వధూవరులను ఆశీర్వదించారు. మంత్రులు, పుర ప్రముఖులు, చలనచిత్రరంగానికి చెందిన అనేకమంది కళాకారులు వధూవరులను ఆశీర్వదించారు.

# సినిమా

ఆడదానిమీద అనుతావురా. అంత ధైర్యం వుంటే వాళ్లింటికెళ్లి వున్నదంతా వూడ్చుకు రారా! అని చెడా మడా నాలుగు తిట్టాడు.

నాగ: హ! హ! హ! ఇక్కడ నేను వున్నాను. నాదగ్గర తుపాకీ వుంది. వస్తే షూట్‌చేసేస్తానని తెలీదులా వుంది. ఆ తర్వాత ?

జమున: తర్వాత క్లయిమాక్సు

ఈ వుత్సుకతను కల్గించే సంఘటన జమునకు నిజంగా జరిగిందనుకునేరు సుమా, కాదు-కాదు. మాధవి పిక్చర్స్ నిర్మిస్తున్న 'బందిపోటు దొంగలు' చిత్రం లోనిది. జమునను అటకాయించిన విలన్ యెవరు ? ఆమెను ఆపదనుండి కాపాడిన హీరో యెవరు? అన్నదానికి చిత్రం చూస్తే మీకు తెలుస్తుంది.

తెలుగు చిత్రాల్లో కొత్తదనాన్ని తీసుకు వచ్చే సంఘటనలను తెలుగువారికి నచ్చే విధంగా దర్శకులు కె. ఎస్. ప్రకాశరావు ప్రతి ఫ్రేమును చక్కగా చిత్రించారు. నాగేశ్వరరావు, జగ్గయ్య, రంగారావులకు సరికొత్త పాత్రలనిచ్చి, వారి నటనను మీరు మెచ్చే విధంగా చిత్రాన్ని రక్తి కట్టించాడు దర్శకుడు. పెండ్యాల సన్ని వేశానుగుణ్యంగా సంగీతాన్ని విన్పిస్తే, వెంకటరత్నం కన్నుల పండువయిన ఛాయా గ్రహణాన్ని చూపించారు: 15 లక్షలకు పైగా ఖర్చు పెట్టినట్లు అంచనా వెయ్య బడుతున్న ఈ చిత్రాన్ని సుబ్బారావు, రాజేంద్ర ప్రసాదులకుగాను ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు సమర్పిస్తున్నాడు.

## తెలుగుతనం ఉట్టిపడే పాట

హైదరాబాదుకు వస్తారా అని అడిగాడు సుంకువల్లి. దేనికి అని ప్రశ్నించాను. 'మా పిక్చరు ఔట్‌డోర్ నాగార్జునసాగర్ డ్యామ్‌వద్ద తియ్యాలను కుంటున్నాము. జాలీగారండి. సరదాగా గడిపివద్దాం' అన్నారు. ఎవరెవరు వస్తున్నారేమిటి అని అడిగాను. 'షీలా, శోభన్‌బాబు వస్తారు, బాలచందర్ + టెక్నికల్‌యూనిట్ అనుసరిస్తుంది' అన్నాడు. అక్కడ మీరు షూటింగు జరుపనున్నదేమిటో చెప్పేచాలండీ. అంత మారంవచ్చి నాల్గురోజులు వుండిపోతే, యిక్కడ మద్రాసులో జరిగే షూటింగు వివరాల్ని తెల్పుకోవడం యెలా అన్నాను.

అవేనని తెలిపి తాను చిత్రించబోయే పాటను వివరించారు.

రష్యాలో పుట్టి; భారతావనిలో మెట్టి
తెలుగువారి కోడలినై, వలపులొలుకు
జాబిమల్లి
ఆదికవి నన్నయ్య అవతరించిన నేల
తెలుగుభారతి అందియలు పల్కించావే
నాగార్జుని బోధనలు ఫలించినచోట
బౌద్ధమత వృక్షమ్ము పల్లవించినచోట
కృష్ణవేణీ తరంగిణి జాలిగుండియై
సాగరమ్మై రూపు సవరించుకొనునీట...

ఈ తెలుగు తనం పుట్టిపడే పాటను నారాయణరెడ్డి మనలోని ఆంధ్రత్వాన్ని మేలుకొలిపే విధంగా లలిత పదజాలంతో కుసుమ కోమలంగా వ్రాసారు. ఆ లాలిత్యాన్ని టి. వి. రాజు తన సుమధు-సంగీత స్రవంతితో పుష్పింప చేసారు. పాటకి భావానుగుణ్యంగా షీలా, శోభన్‌బాబులు నటించారు. ఈ పాటను దర్శకుడు బాల చందర్ గోదావరీ నదీ తీరాన, నాగార్జున సాగర్ డ్యామ్ వద్ద, హంపీ శిల్ప సౌందర్య సమక్షాన చిత్రీకరించారు. శ్రీరాజ్ ఆర్ట్ ఫిలింస్ నిర్మిస్తున్న మొదటి చిత్రంలో



'సత్తెకాలపు సత్తెయ్య'లో విజయలలిత

కన్పిస్తుంది యీ పాట—ఆట; కె. బాల చందర్‌కు పాణి చేదోడు వాదోడుగా వుంటూ చిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా వుండడానికి సహాయ పడుతున్నాడు. బాల చందర్ స్వంత కథకు భమిడిపాటి వ్రాసిన సంభాషణలు జీడిపప్పుకు పంచదార చేర్చి నట్లయింది. ఈ చిత్రాన్ని సుంకువల్లి నిర్మిస్తున్నాడు. సావిత్రి, రామారావు,

# సినిమా

కృష్ణ, విజయనిర్మల, రాజబాబు, మీనాకుమారి మరియు నాగభూషణం, పుష్పకుమారి ముఖ్యపాత్రలను ధరిస్తున్న యీ చిత్రం 1969 మొదటి భాగంలో విడుదలౌతుంది.

## ఏడాదికి మూడు చిత్రాలు

మధు పిక్చర్స్ బ్యానర్‌తో 'మంచి మిత్రులు' సాంఘిక చిత్రాన్ని, భారతి సంస్థద్వారా 'మహాబలుడు' జానపద చిత్రాన్ని నిర్మిస్తున్న మల్లికార్జునరావు ఏటేటా మూడుచిత్రాలను నిర్మించ డానికి నిశ్చయించారు. అన్ని తరగతుల ప్రేక్షకుల్ని వొప్పించేందుకై యీ పథకాన్ని వేసుకున్నారు. అందుకే మూడు విభిన్నమయిన కథలను యెన్నుకుని, మూడు సంస్థల ద్వారా నిర్మించి, ప్రేక్షకులకు సినిమాల ద్వారా విజ్ఞానాన్ని, వికాసాన్ని, కాలక్షేపాన్ని అందించేందుకు నిశ్చయించుకున్నారు. మల్లికార్జునరావు మనస్సు మంచిది; తన మనస్సులాగే అందరికి 'మంచి' చేకూరాలనే అభిలాష వుంది; కాబట్టి భగవంతుడు యీయనకు 'మంచి' ఫలితాల్ని యివ్వాలనడంలో తప్పులేదేమో... జనవరి మొదటివారంలో శోభన్‌బాబు, కృష్ణ నటించిన ఈ చిత్రాన్ని శ్రీ ఫిలింస్‌ద్వారా విడుదల చెయ్యనున్నారు.

'మంచి మిత్రులు' చిత్రాన్ని తాతినేని రామారావు డైరెక్టు చేశారు, సంగీతాన్ని కోదండపాణి కమ్మగా వినిపించారు.

* * *

మనకున్న మంచి నిర్మాతల్లో డి. వి. ఎస్. రాజు మరొకరు. తనేమో, తన పనేమో చూసుకుంటూ, సాధ్యమయినంత వరకు యితరులకు వుపకారం చేసే స్వభావం గల వుత్తమ వ్యక్తి రాజు; డి. వి. ఎస్. సంస్థద్వారా 'మంగమ్మ శపథం', 'పిడుగు రాముడు', 'టిక్కా శంకరయ్య' చిత్రాల్ని నిర్మించారు. ఇప్పుడు విఠలాచార్య దర్శకత్వంలో రామారావు నాయకుడిగా మరొక జానపదాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రం యొక్క షూటింగు డిసెంబరు 8 నుండి వాహినిలో ప్రారంభమౌతుంది. ఈ చిత్రానికి సంబంధించిన రెండు పాటలు యిటీవల రికార్డు చెయ్యబడ్డాయి. ఆ రెండు పాటల్ని మీకు తెల్పడం నాధర్మం అనుకుంటున్నాను.

మరదలు పిల్లా ఎగిరిపడకు;
గడసరి పిల్లా పులికి పడకు;
నా గెలుపే నీ గెలుపు కాదా!

ఈ పాటను సి. నా. రె. వ్రాశారు; టి. వి. రాజు సంగీతాన్ని వినిపించారు; ఘంటసాల పాడిన యీ పాటను తెరపై ఎన్. టి. రామారావు అభినయిస్తారు.

పాడనా మనసు పాడని పాట







'కథానాయకుడు'లో ఎన్. టి. ఆర్, ...



# సినిమా

ఆడనా పదము లాడని ఆట—పాటను జయలలిత, ఎన్. టి. ఆర్.ను వూహిస్తూ పాడుతుంది; తెరవెనుక సుశీల గానం చేసింది. నారాయణరెడ్డి కవితకు టి. వి. రాజు బాణీ కూర్చారు.

జి. కృష్ణమూర్తి రచన. ఎస్. ఎస్. లాల్ కెమెరా, టి వి. రాజు సంగీతాన్ని, పాటలను నారాయణరెడ్డి, కొసరాజు, నృత్యాల్ని హీరాలాల్ నిర్వహిస్తున్న యీ చిత్రంలో ఎస్. టి. ఆర్, జయలలిత, దేవిక, రాజనాల, ప్రభాకరరెడ్డి, రాజబాబు, ముఖ్య పాత్రధారులు.

*　　*　　*

సినీరంగంలోని అనేకానేకులకు శిరోజాలంకరణ చేసిన తానారపు సూర్యనారాయణ పరమ పదించారు. వారి భార్య, ఆర్గురు బిడ్డలు నిరాధారులైనారు. వారికుటుంబానికి ఇతోధికమయిన ఆర్థిక సహాయాన్ని చెయ్యాలనెడి సదుద్దేశ్యం నటి విజయనిర్మలకు కల్గడం అభినందనీయం. ఆమెకు కృష్ణకుమారి, కాంచన, భారతి, విజయలలిత, హేమలత, మేకప్ మాధవరావు తమ సంపూర్ణ సహకారాన్ని అందించడానికి ముందంజ వేసారు. ఒక మంచి పనికి అందరి ఆదరణ అవసరం. నటి విజయనిర్మల చేపట్టిన యీ కార్యానికి పరిశ్రమలోని ప్రతివారూ తగినంత ప్రోత్సాహాన్ని, సహాయాన్ని అందివ్వగలరని ఆశిస్తున్నాను.

## చిత్రవిజయానికి నాందీ వాచకం

ప్రసాద్ స్టూడియోలో జయలలిత నాట్యం చేస్తుంది అని వినగానే నాకున్న పనంతా మానుకుని టాక్సీయెక్కి స్టూడియోకు చేరుకున్నాను. స్టూడియోలో అడుగిడగానే వందరూపాయలనోట్లు కట్టలు కట్టలుగా టేబిలుమీద వుండడాన్ని, దాన్ని నిర్మాత గోపాలక్రిష్ణ, దర్శకుడు హేమాంబరధరరావు, పబ్లిసిటీ మోహన్ కుమార్ 'జాక్ పాట్' రేసులో గెలుచుకున్నారని విని సరాసరి టేబిలు దగ్గరికెళ్లి ఆముగ్గుర్ని అభినందించాను. 'అదృష్టం'మీద నమ్మకం లేదంటారు కొందరు; అదృష్టం అనేది వుంది అని వీరి విజయం నిరూపించింది. వారి చిత్ర విజయానికి యీ 'జాక్‌పాట్' సాధన నాందీ వాక్యం పల్కిందని నేను అనుకుంటున్నాను; ఈ సందడిలో అసలు సంగతిని మర్చిపోతే యెలా? జయలలిత నాట్యం చేస్తుందని విని, వెళ్లిన నాకు ఆమె నయనానంద కరమయిన నృత్యాన్ని చూచే అదృష్టం కల్గ లేదు; ఎందుకని మీరు అడుగుతారుగా; రెండు రోజులుగా కాస్త జ్వరం తగలడం వల్ల, స్టెప్స్ వెయ్యడం కాస్త మందగిస్తుందేమోనని ఒక డైలాగు సీనును పెట్టుకున్నామని దర్శకుడు హేమాంబరధరరావు; జ్వరంలోనే జయలలిత షూటింగులో పాల్గొని తన కర్తవ్య నిర్వహణలో క్రమశిక్షణను ప్రదర్శించింది. మరి నేను చూచిన దృశ్యాన్ని మీకు చెప్పకపోతే యెలా?; ప్రభాకరరెడ్డి, జయలలిత అన్న

# మీకు తెలుసా

ప్రముఖ నటి విజయలలిత మాంబళంలో ఒక కొత్త యింటిని కొన్నది; ఉగాదికి గృహప్రవేశం చెయ్యాలనుకుంటుంది.

ప్రముఖ నటుడు శివాజిగణేశన్‌కు 'అంజల్ పెట్టి 500'షూటింగులో గాయం తగిలింది ప్రస్తుతం కోలుకుంటున్నాడు.

నవభారత్ పిక్చర్స్ అధినేత ప్రకాశరావుకు 'జాక్ పాట్' ఒక నెంబర్లో తప్పిపోయింది. టిక్కెట్టును యింట్లో పెట్టి సినిమాకు వెళ్లడం వల్ల నాల్గు నెంబర్లు పాస్ అయిన టిక్కెట్టుకు సిండికేటులో చేరే అవకాశం లేకుండా పోయింది.

ప్రముఖ నర్తకి, నటి అయిన వైజయంతిమాల యిప్పుడు 'ఆండాళ్ తిరుప్పావై' నృత్యనాటికను ప్రపంచమంతటా ప్రదర్శించడానికి పూనుకుంది.

ప్రసాద్ ఆర్ట్సు నిర్మాత ప్రసాద్‌కు అమిత వేగంగా కారు నడపటం ఒక సరదా.

నేటి బాక్సాఫీస్ నటి జయలలితకు 'తంగ శిలై' బిరుదాన్ని శివాజిగణేశన్ ప్రదానం చేసాడని మీకు తెలుసా?

పరిచయం



నేపథ్యగాయకుడు

## బాలసుబ్రహ్మణ్యం

కోదండపాణిద్వారా 'మర్యాదరామన్న' చిత్రంలో గాయకుడిగా పరిచయం కాబడ్డ బాలసుబ్రహ్మణ్యం, తన గాన కౌశలంతో స్వల్ప వ్యవధిలో ప్రముఖ నేపథ్యగాయకుల లిస్టులో చేరిపోయాడు.

గొంతులో మాధుర్యంవుంది; పాడడంలో నేర్పు కన్పడుతూవుంది, పెద్ద సంగీత దర్శకుల అభిమానం దొరికింది; సాటి గాయకుల అప్రోత్సాహం లభిస్తూంది. వయస్సులో చిన్నవాడిగా కన్పించినా, చాకచక్యంలో పెద్దతనం గోచరిస్తూంది.

తెలుగులోనేగాక తమిళ చిత్రరంగంలో కూడ కె. వి. మహదేవన్ ద్వారా ఎం. జి. రామచంద్రన్‌కు పాడే అవకాశం లభించిన యితడు అదృష్ట జాతకుడు.

మనం పైకి వస్తున్నాంగదా అనే భావం రానీకుడదా, మనం యింకా చాలా నేర్చుకుంటాం అని నుకుంటూ, తన జీవిత నౌకను జసాగిస్తే, యీ కుర్రవాడు త్వరలోనే గొప్పగాయకుడు కాగలడుఅనిఅనడంలోఅతిశయోక్తి లేదు.

## సినిమా

చెల్లెళ్ళు తన అన్న త్రాగుబోతు అని తెలిసినాకూడ జయలలితకు అతనంటె ప్రాణం; అతనిచేత త్రాగుడు మాన్పించా అని యెన్నో విధాలుగా ప్రయత్నిస్తుంది; ఈ త్రాగుబోతును మంచిదారికి తీసుకు రావడం యెలా అని ఆలోచిస్తున్న సమయంలో ప్రభాకరరెడ్డి గుడిసెలోకి వస్తాడు

జయలలిత : రా, బువ్వ తిందువుగానీ.

ప్రభాకర్ : నాకు ఆకలికాలే.

జయలలిత : నీ ఆకలి సంగతి నీకు తెలిస్తే యింకేం. నీకు యిష్టమని గోంగూర పచ్చడికూడ చేసాను...రా.

ప్రభాకరరెడ్డి : నా మంచి చెల్లెలు అంటూ కవళం కలపడానికి వెళ్తాడు; భోజనాలు కాగానే అన్నా, చెల్లెళ్ళు యిద్దరు పడుకుంటారు; కాస్సేపటికి జయలలిత నిద్రలేచి చూసేసరికి ప్రభాకరరెడ్డి కన్పించలేదు.

జయలలిత : వీడికింక బుద్ధిరాదు; మళ్ళీ ఆ నప్పిగాడు యే త్రాగుడుకో, పేకాటకో తీసికెళ్ళి వుంటాడు. (యేదో జ్ఞాపకంవచ్చి) కొంపదీసి డబ్బు తీసుకు పోలేదుకదా! ఈ సన్నివేశం గోపాలక్రిష్ణా పిక్చర్స్ 'కథానాయకుడు'లో వుందో లేదో తెల్సుకోండి; ఈ సన్నివేశాన్ని సహజంగా వుండేలాగు దర్శకుడు; ఛాయాగ్రాహకుడు తమ పనితనాన్ని చూపెట్టారు; గోపాలక్రిష్ణ నిర్మించే యీ చిత్రాన్ని మీకు చూపించే బాధ్యతను పూర్ణాపిక్చర్స్ తీసుకున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు హేమాంబరధరరావు; ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి; సంగీత నిర్దేశకుడు టి. వి. రాజు.

* * *

'అగ్గిమీద గుగ్గిలం' చిత్రాన్ని నిర్మించిన ప్రకాశరావు, పూర్ణచంద్రరావులు తమ రెండవచిత్రాన్ని జనవరిలో ప్రారంభిస్తున్నారు. ఇదికూడ జానపదమే; చిత్రంలోని ముఖ్యపాత్రలను 'అగ్గిమీద గుగ్గిలం' నటీనటులే పోషిస్తారు; మొదటి చిత్రానికి పనిచేసిన టెక్నికల్ యూనిట్ యీ చిత్రానికి కూడ పనిచేస్తుంది. కథను మహతి వ్రాస్తున్నాడు. ఈ చిత్రాన్నికూడ పూర్ణా పిక్చర్స్ విడుదలచేస్తారు వీరి 'అగ్గిమీద గుగ్గిలం' చిత్రాన్ని పింజల సుబ్బారావు తమిళంలో డబ్‌చేసి విడుదల చేసాడు; ఈ తమిళప్రతి తమిళదేశంలో విజయఢంకా మ్రోగిస్తుంది.

— శ్రీనివాస్



'బందిపోటుదొంగలు'లో జమున, నాగేశ్వరరావు.

## మద్రాసు షెరీఫ్‌గా శ్రీ సుందర్‌లాల్ నహతా

ప్రముఖ చలన చిత్ర పారిశ్రామికుడిగా పేరు పొందిన శ్రీ సుందర్‌లాల్ నహతా మద్రాసు షెరీఫ్‌గా నియమింపబడ్డారు. డిసెంబరు 20 వ తేదీన షెరీఫ్‌గా పదవీస్వీకారం చేస్తారు. శ్రీ సుందర్ లాల్ నహతా యిప్పటివరకూ తెలుగు, హిందీ, తమిళం, మళయాళం, కన్నడ భాషలలో 30 చిత్రాలు నిర్మించారు. చిత్ర నిర్మాణంలో, పంపిణీలో అనుభవమున్న వ్యక్తి. దక్షిణ భారత ఫిలిం వాణిజ్య మండలికి అధ్యక్షుడుగా, భారత ఫిలిం ఫెడరేషన్‌కి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. హిందూస్తాన్ వాణిజ్య మండలి ఉపాధ్యక్షుడుగా కూడా ఉంటున్నారు. చలనచిత్ర పరిశ్రమకి చెందిన వ్యక్తిని షెరీఫ్‌గా నియమించడం యిదే మొదటిసారి. శ్రీ నహతాకి ఫిలిం పరిశ్రమతోనే కాకుండా యితర పరిశ్రమలతో కూడా సంబంధాలున్నాయి. 1923



శ్రీ సుందర్‌లాల్ నహతా

లో కలకత్తాలో జన్మించారు. వాణిజ్యంలో పట్టభద్రులు. చాలాకాలం విజయవాడలో ఉన్నారు. తెలుగు బాగా మాట్లాడగలరు.

## చెన్నపురి ఆంధ్ర విద్యార్థిసమితి ప్రతినిధివర్గం సమావేశం

చెన్నపురి ఆంధ్ర విద్యార్థి సమితి ప్రతినిధుల సమావేశం డిసెంబరు 1 న స్థానిక ఎం. డి. సీ. ల్. సెమినార్ హాలులో జరిగింది. ప్రార్థనానంతరం సమితి అధ్యక్షుడు శ్రీ టి. పెద్దకృష్ణ గత సంవత్సరం సమితి నిర్వహించిన కార్యకలాపాలను, జమా ఖర్చులను వివరించారు. ఈ సంవత్సరం సమితి నిర్వహించే కార్యక్రమాలను గురించి తెలియజేసి ప్రతినిధులంతా కార్యనిర్వాహక వర్గానికి సహకరించాల్సిందిగా కోరారు. సభ్యులలో రచనా శక్తిని పెంపొందించటానికి దోహదం చేసే నిమిత్తం సమితి కార్యక్రమాలను సభ్యులకు తెలియ పరిచేందుకు వార్తాలేఖ ఒకదాన్ని సంపుటాలుగా వెలువరించడానికి సన్నాహాలు జరుగుతున్నాయని అన్నారు. కార్యదర్శి శ్రీ హరికృష్ణయ్య సమితి కృషిలో ప్రతినిధులంతా సహకరించాల్సిందిగా విజ్ఞప్తి చేశారు. అనంతరం సహాయ కార్యదర్శిని కుమారి ఆర్. సుహాసిని వందన సమర్పణ చేశారు. (ఒ. వి.)

ఆటలు

# భారతదేశంలో పర్యటిస్తున్న రష్యన్ ఫుట్‌బాల్ బృందం



ప్రస్తుతం ఇండియాలో పర్యటిస్తున్న రష్యన్ ఫుట్‌బాల్ బృందండైనమో మిన్స్క్, ఇండియా XI డిసెంబరు 1వ తేదీన మద్రాసు నెహ్రూ స్టేడియంలో ప్రదర్శన మాచ్‌ని ఆడారు. ఈ పోటీలో రష్యన్ బృందం విజయాన్ని సాధించింది. ఇది వారు మనదేశం పర్యటనలో సాధించిన నాలుగవ ఘనవిజయం. రష్యన్ ఆటగాళ్ళు చురుకుగా, నేర్పుతో ఆడారు. మన ఆటగాళ్ల ఆటలో చురుకుతనం లోపించడమేకాకుండా వారి నిదానపు ఆట చూపరులైన 30వేలమంది ఓర్పుని పరీక్షించింది.

రష్యన్ ఆటగాళ్లు మొదటి నుంచీ ఎంతో వేగంగా, కదలికలో తమ నేర్పుని ప్రదర్శించి, మనవారు వారిముందు పసి పిల్లలాలా కనిపించేలాగా ఆడారు. ముఖ్యంగా చెప్పుకోదగింది ఏమిటంటే రెండు మూడుసార్లు తప్ప బంతిని గోల్‌లోకి మొట్టమొదటిసారే కొట్టడం అన్నది వారిలో లోపించడమే. మిగతా వారితోపాటు అదమోవ్ తన మెరుపులాంటి కదలికలతో ఆటస్థలం అంతా తానై ఆడాడు. అతను దూరం నించే మంచి గోల్‌ని చేశాడు.

రష్యన్‌లు సాధించిన రెండవ గోల్ సెమినోవ్ సాధించాడు. అతను రెండవ సగంలో మరొకరికి బదులుగా వచ్చాడు. అతను కొట్టిన ఫ్లయింగ్ షాట్‌ని చురుకైన ఆటని ప్రదర్శించిన సలీమ్ కూడా ఆపలేక పోయాడు. రష్యన్‌లు కనుక సెమినోవ్, అదమోవ్‌లలా పట్టుదలతో బంతిని కొట్టినట్లయితే ఇంకా పెద్ద తేడాతో ఇండియన్‌లు వోడిపోయి ఉండేవారు. మరొక ఆటగాడు నకరోవ్ తమాషాగా అందరిచే ఆకర్షింపబడేట్లు ఆడాడు కాని చివరకి నిరాశని కలిగించాడు. కానీ అందరూ మంచి దారుఢ్యాన్ని, వేగాన్ని ప్రదర్శించారు.

డిఫెన్స్‌లో ఉన్న ఘోష్, రాజా, యూసఫ్‌ఖాన్‌లు సలీమ్‌తోపాటు కష్టపడి ఆడారు. బికనీర్ కవలలు చైన్‌సింగ్, మగన్‌సింగ్‌లు కొంత బాగానే ఆడారు కానీ వారు తమ స్థానాలను విస్మరించారు.

ఇది అత్యుత్తమమైన ఆటని ప్రదర్శించడం కాకపోవచ్చు కానీ అదమోవ్ చాకచక్యం ప్రేక్షకులని ఆనందపరచింది.

బెంగుళూరులో డిసెంబర్ 4న జరిగిన అయిదవ మాచ్‌లో రష్యన్ బృందానికి మైసూర్ చీఫ్‌మినిస్టర్స్ బృందం మంచిపోటీ అయింది. రష్యన్ బృందం 2–1 గోల్స్‌తో విజయాన్ని సాధించగలిగింది.

—కె. ఎస్. నరసింహన్

మద్రాసులో

## అంతర్జాతీయ అవార్డు పొందిన నిడివి తక్కువ చిత్రాల ప్రదర్శన

మద్రాసు ఫిలిం సొసైటీవారు యిటీవల స్థానిక సఫైర్ థియేటర్‌లో అంతర్జాతీయ అవార్డులని అందుకున్న 19 నిడివితక్కువ చిత్రాల ప్రదర్శన ఏర్పాటు చేశారు. ప్రదర్శించిన చిత్రాలన్నీ ఉన్నతమైన సాంకేతిక విలువలతో ప్రేక్షకుల ఆలోచనకి దోహదం కల్పించి, మనోవికాసానికి సహకరించే విధంగా ఉన్నాయి. ముఖ్యంగా ఇన్‌సామ్నియా (నిద్రలేమి), ఇగ్‌రా (ఆట), స్వద్‌బా (వివాహం) చిత్రాలు ప్రేక్షకునికి మంచి వినోదాన్ని కూడా అందించాయి. ఇలాంటి మంచి చిత్రాలని ప్రదర్శించిన మద్రాసు ఫిలిం సొసైటీ కృషి అభినందించ తగినది. (ఒ. వి.)

## బందా కనకలింగేశ్వరరావు

నాటకాల్లో 'కృష్ణ' పాత్రకి ప్రాణంపోసినవారు శ్రీ బందా కనకలింగేశ్వరరావు. ఆ పాత్రతో ఆయన ఆంధ్ర ప్రజల మనస్సులో నిలిచి పోయారు. ఆయన రూపించిన కృష్ణ పాత్రనిలచి ఇప్పుడు ఆయన లేరనుకుంటే మనసు ద్రవించక మానదు.



శ్రీ బందా బందరులో బి. ఎ. చదివి, మద్రాసులో బి. ఎల్. పాసయ్యారు. మద్రాసు హైకోర్టులో ఆరు సంవత్సరాల పాటు న్యాయవాదిగా పని చేశారు. ఆయనకి సాహిత్యమన్నా నాటకరంగమన్నా ఎంతో ఆపేక్ష. కూచిపూడి నాట్యోద్ధరణకి ఎంతో కృషి చేశారు. బొంబాయిలో తయారయిన ద్రౌపది, సారంగధర, బాలనాగమ్మ మొదలైన చిత్రాలలో నటించారు. 1942 లో ఒక డ్రామా ట్రూపును తయారుచేసి ఎన్నో నాటకాలు వేశారు. 1956 నుంచి ఆకాశవాణిలో పని చేస్తున్నారు. నటనలో కేంద్ర సాహిత్య అకాడెమీనుంచి బహుమతి కూడా తీసుకున్నారు.

గుంటూరు ఆసుపత్రిలో మరణించే నాటికి ఆయనకు 62 ఏళ్లు. భార్య, ఆరుగురు కుమార్తెలు, ఒక కుమారుడు వున్నారు.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

తప్పక చూడండి

L. లింగశెట్టి

సమర్పించు

నిండుసంసారం అంటే మా కుటుంబం,
మా కుటుంబం, మనలాంటి మరి కొందరి
కుటుంబం!






నవశక్తి ప్రొడక్షన్స్

# నిండుసంసారం

దర్శకత్వం C.S రావు B.A (LITT) నిర్మాత P. గంగాధరరావు

JOTHEE